శ్రీ రస్తు.

---

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణేనమః.

బృహదశ్వరాజసంవాదరూపంబును

శ్రీమద్రాఘవాచార్యకవివరప్రణీతంబును

కలికల్మషనివారకంబునగు,

# నలచరిత్రము-ద్విపదకావ్యము.

ఇది,

సత్యాంశోపయుక్తంబగునటుల

పండితులచే బరిష్కరింపఁబడి

శ్రీచెన్నపురంబునందు

బి. వి. రంగయ్యశెట్టిగారి

స్వకీయ

శ్రీలక్ష్మీనృసింహవిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రించిప్రచురింపఁబడియె.

19-5-11.

కిమ్మతు 4 అణాలు



శ్రీరస్తు.

# నలచరిత్రము - ద్విపదకావ్యము.

## ప్రథమభాగము.



క॥ శ్రీరమ్యధర్మనిత్య । ప్రారంభవిభాసిరాజ్య పరమేశ్వర ఘో।
రారిమదకుంభికుంభవి । దారణదారుణకృపాణదక్షిణహస్తా॥

శ్లో॥ శ్రీవాణీగిరిజాశ్చిరాయదధతోవక్షోముఖాంగేషు। యేలోకానాంస్థితి
మావహంత్యవి  హతాం స్త్రీపుంసయోగోద్భవాం। తేవేదత్రయమూ
ర్తయస్త్రిపురుషా స్సంపూజితావస్సురై । ర్భూయాసుఃపురుషోత్త
మాంబుజభవశ్రీకంధరాశ్శ్రేయసే॥

### — రాజ్యంబులోడిన పాండవులయొద్దికి బృహదశ్వుడేతెంచుట. —

సలలితసౌర్థాంధ్రశబ్దసంగతుల। వలెనొప్పనలచక్రవర్తిచరిత్ర। విరచింతు
నానేర్చువిధమెల్ల దెలియుక। కరమొప్పగత్కథాక్రమమెట్టిదనిన। పరమపావ
నుడైనపాండునందనుడు। ధరయెల్లకల్లజూదంబుననోడి। కౌరవాగ్రజుపాలు
గావించిదైత। ఘోరాటవులకుపోక్కుచునేగించుచట। తనతమ్ములనుదానుతన
కూర్మిసతియు। మునివేషము దాల్చిమోదంబుదక్క। విహరింపుచుండిరివిధివ
శంబునను। మహిమతోడనుభూమిపైనిద్దనలది। అరుదైనరౌద్రాతపహారముల్
వేసి। యురవుకెంజెడలెల్లయొగిచుట్టగట్టి। పరగకృష్ణాజినాబరముధరించి। కర
ముజెన్నొందగాకమండలవు। ధరియించిజపమొన్నుదన్నచేనుంచి। పరువడివరయో
గపట్టెధరించి। ఘనతరంబుగపాదుకలు వేడ్కమెట్టి। కరుణతోవేంచేయగాజూ
చిపాండు। తనయుండుతమ్ములుతానును వేగ। జనుదెంచిఎదురుగానంయమీ
శ్వరునిచరణాంబుజములకుచయ్యనమ్రొక్కియపుడుగానర్ఘ్యపాద్యాదిసత్క
ర్మవితతులబూజించివినుతులుచేసి। యతిభక్తిగొనివచ్చియుహాసనమున।
నునిచిచేతులుమోడ్చియురుతరభక్తి। సనియెనుమునితోడనారాజవిభుడు। ప
రమయోగధ్యానపావనజ్ఞాన। చిరదయానిధిమీకుక్షేమమేయనిన। వినిమునీం
ద్రుడుధరావిభునకిట్లనియె। జననాథనీవంటిసత్యసంధుండుగలుగుటక్షేమంబుగ
లుగుగాక। యిలక్రమంబులుమిన్నిహోటికివచ్చి। ధరణీతలేశనీతరములునీవుపరి

కామమే యనిపరికించి చూడగ। మనమునఁజింతించి మరిపాండుసుతుడు। దనమ
దిదెచ్చియుత్తపసికిట్లనియె। దేవదయాసాంద్ర దేవేంద్రవంద్య। యీవేళమా
సౌఖ్యమేమనవినుము। కపటజూదంబున కౌరవేంద్రునకు। విపులసంపదలెల్ల
విడువంగగలిగె। నదియాదిగాగ యీఅరణ్యభూమి। ముదమెల్లదక్కి యీము
దితతోఁగూడి।తమ్ములు నేనును తపసివేషంబు। నిమ్ములధరియించియిట్లుండగ
లిగె। నాకటివేళకు నన్నంబులేక। నాకులు కాయలు నరసిభక్షించి। దినమొక్క
యేడుగాదీనతఁబొంది। యెంసినీయడవిలోనిట్లుండగలిగె। పరతెంచియుష్టదిక్ప
తులునునయిన। ధరలోన సాధింపదగిన సోదరులు। శూరత్వములుమాని సు
ఖములుడించి। ఘోరాటవులలోనఁగూర్చుండవలసె। ద్రుపదనందనయిట్టికు
ర్దశనొందె। విపులశోకంబున వేగింపగలిగె। చిత్రశయ్యలయందు చెలగినిద్రిం
చి।పత్రశయ్యలయందుపవళించగలిగె। సంగీతవిద్యాఘోషంబులాలించి। సిం
గంబుకూతను చెవియొగ్గగలిగె। నలువైనసింహాసనముల కూర్చుండి కొలదికె
క్కగరాలగూర్చుండగలిగె। నారామసీమల నలవర్తించి। యారణ్యసీమల నడ
లంగగలిగె।హితవుగతన పురోహితులతోనుండి। మితిలేనిమృగముల మెలగం
గగలిగె। వెలలేనికర్పూరవీడెముల్ జేసి। నలసియాకుబ్రవేళ్లనమలంగగలి
గె। జాతిగంధము మేననలవితోఁబూసి। భూతిగంధము మేనబూయంగలిగె। ని
టువంటిసుఖములకిరువైతిమయ్య। కటకటాదయలేక కౌరవాగ్రజుడు। యెరు
గకనిటుచేసె నేమనవచ్చు।పరమయోగీంద్ర నాభాగ్యమిట్లుండుడెపుట్టిపోయి
నవారు పుట్టినవారు। పుట్టబోయ్యేవారు భూలోకమునను। దాయాదివారిచే
ధరయెల్లనోడి।పోయిమావలెవనభూమిలోనిట్లు పొందియీ వెతలనుబొంది
నవార। లెందైనగలరె మీరెరిగినయెడల।ననవుడు మునిచంద్రుడారాజుజూచి
ఘనకృపారసమొలుకంగనిట్లనియె। ఇదియేమి జననాథ యింతగానీవు।మదిలో
నయిట్లాడమరచితేసితి।పోపొమ్ము మరియేమిబుద్ధులుమీరు। ప్రాపించిచింతిం
పపనిలేదువినుము। తొల్లిజేసినయట్టిదుష్టకర్మమును। నెల్లపొందక విధియేల
పోనిచ్చు।కమలాదిధరునకు కమలగర్భునకు। కమలేశునకు శతక్రతునకునైన
కొన్నాళ్లుదుఃఖంబు కొన్నాళ్లుసుఖము। కొన్నాళ్లు లేమియు కొన్నాళ్లు కలిమి
వసుమతిసమముగావర్తింపుచుండు।వసుమతీశ్వరయింతవగపేలనీకు। నదిగా
క ఏదుఃఖమందితిరిలను। ముదమొప్పమావంటిమునుబుమీకడకు। చనుదెం
చినిత్యమునకలశాస్త్రములు।వినుపించెదము మీకు వేశ్వేరనింక।తమ్ములుబా

సితో తరుణి బాసితివో। సమ్మతిగాని వేషములు జెందితివో। కడిపురంబున నీవు క్ర
మముతో నున్న। వరుసతో నచటికి నెత్తుము మేము। పుణ్య వేళలయందు పుణ్యతీ
ర్థములు। పుణ్యుడై గుర్తించుచు పుణ్యముల్ జేసి। పితృ వేళలయందు పితృకాల
ములను। నతిభక్తితో జేసియఘములుద్రోచి। ఇటువంటిసుఖములకిరవుగా
నుండి కటకటా నీవు శోకము జెందదగునె। వసుధ నాపద బడ్డవారలలోన। పొనగ
నేయాపద బొందితి విపుడు। జననాథునీకింత సన్తాపమేల। వినుము చెప్పెదనీకు వి
శదంబుగాను। నవనిలోన నలనాథుడగు మహారాజు। ప్రవిమలసత్యసంపన్నుడగ
నుడు వినుతి కెక్కిన బాహువిక్రమోన్నతుడు। వినయభూషణుడతి విమలమా
నసుడు గురుభక్తినిరతుడు గుణవిశారదుడు। కరుణాపయోనిధి గాంభీర్యధను
డు। ధరణి షోడశమహాదానవినోది। యుక్తుడైన సకలశాస్త్రార్థకోవిదుడు।
చిరపుణ్యమతి వీరసేన సుతుండు। ధరణి వంశజుండు కందర్పసన్నిభుడు। నిరుపమ
విజయుండు నిషధేశ్వరుండు। పరమపావనుడు శ్రీపతిభక్తియుతుడు। సురరాజ
విభుడు భూసురవర్ణనీయు। డరిబలహారి మహానలుండగుచు। నలునిపట్టపురా
ణి నలినాయతాక్షి। అలివేణి దమయంతి యనియెడియింతి। పరమపతివ్రత బహు
గుణాభరణ। కరిరాజగమన చక్కని చంద్రవదన। తనయుడు వంశవర్ధనుడొక్క
రుండు। మనుజేశ్వరునకు కొమార్తె నొకతె। నిలమేడు దీవుల నేలెడు రాజు। వ
లనొప్పు పుష్కరవసుధీశు తోడ। నవనీశ నీవలెనె వ్యాజమున జూద మవిరళంబుగ నా
డియుట మోసపోయి। పురవరం బెడబాసి భూముల బాసి। దొరలను బాసి ఘన
రథంబుల బాసి। గజముల బాసి ధనముల బాసి। ప్రధానుల బాసి వరపుత్రులను
బాసి। వనితను బాసి పరమాప్తులను బాసి। భటకోటి బాసి సకలబంధుల బాసి స
కలంబు బాసి। చకితాటవుల కేగి చానతో గూడి। కట్టపుట్టము లేక కాంతపై
కొంగు। కట్టుక నడవిలోగ దుఃఖమంది। యాకలి చేచాల నలజడిబడుచు। నాకు
లు కాయలు నలములు భక్షించి। కలిరాజు పన్నిన ఘనమైనమాయ। తెలియక ఇద్ద
రు రెండు తెరవుల బట్టి। తరలాక్షి నెడబాసి ధరణీశుడేడల। ధరణీశు నెడబాసి తర
ళాక్షి యడల। తమ్ము గొల్చినవారి తాము సేవించి। యిమ్ముల నుండిరియిలగొంత
గాల। మరిగిన పిదప శ్రీహరి కృప జేసి। నుత రాజ్యసుఖమున నుండిరి తొల్లి। యం
దనహాస్త్రాంశమైన సుగలదె। యిందువంశజ నీకు నెనసిన కష్ట మవుడ త్యాశ్చ
ర్యమందియా రాజు। ఘనభక్తి ముని రాజు గనుగొని పలికె। వరముని నాథ నా
వలె నలాధిపుడు। ధర యెల్ల కల్ల జూదంబున నోడి। యిటువంటి నడవికి నెబ్బంగి

బోయె। తటుకున నిట్టి జూదంబులు మున్ను। గలిగియుండుట బూనె కౌరవాధి
పుడు। తలచి పల్మారు దూరదగదింక నలుని। చారిత్రమంతయు సాంగంబుగాను।
గారవంబున వినకదు వేడ్క పుట్టె। వినుపింపుమనిన భూవిభుజూచి మౌని తనమ
దిలో బృహదశ్వమహర్షి। యానందమును బొందియుందంద మెచ్చి। ధ్యానిం
చి నలుని సత్కథ చెప్పదొడగె.



శ్లో॥ కర్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ।
ఋతుపర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశనమ్ ॥

### బృహదశ్వుడు పాండవులకు నలుని చరిత్రము చెప్పుట.

నిరుపమగతి నొప్పు నిషధాపురంబు। సురయుగ నుతికెక్కినట్టి పట్టణము। శ్రీక
రనవహేమచిత్రగేహములు। ప్రాకారగోపురప్రాసాదతతులు। కనకంపు మేడ
లు ఘనమంటపములు। వినుతింపదగినట్టి విఫణిమార్గములు। కోటలు యట్ట
ళ్ళు కొలువుకూటములు। నాటకశాలలు గలిన దీర్ఘికలు। కేళికావనములు కృత
శాచలములు। బాలానిలంబులు బహుపుష్పములును। మహనీయ దేవతా
మంటపంబులును। బహుచిత్రగతుల చేబరహర్మ్యములు। శృంగారవనము
లు చెరుకుతోటలును। సంగీతనిలయము లరములు మరియు। రంగుమీరిన
యట్టి రజతశైలములు। చెంగావి చెక్కడము ల్చిత్రశాలలును। కొమరార
ముత్యాలగొడుగులు మఱియు। కమనీయ చక్రసంగతకవాటములు। వారణ
శాలలు వాజిశాలలును। మేరుశైలముకన్న మించు తేరులును। పచ్చతోరణ
ములు బహువిలాసములు। నచ్చుగా గొప్పముత్యముల ముగ్గులును। విమలభూ
షణమున విహరించు హరులు। నమరభూజము తోడ నమరిన తరులు। వారాశి
కిరవైన ననతటాకములు। చారురత్నంబుల సౌధవాటికలు। వేదశాస్త్రపురాణ
విద్యలన్నిటికి। యాదియైన వర్తించునట్టి భూసురులు। రాజులు బలపరాక్రములు
రాహుత్తులు। భూజననుతులైన బుధులు బాంధవులు। ధనదుని పురినైన ధర
యెల్లచూర। కొనిదాచగల వైశ్యకోటి చెన్నొంద। హరిభక్తియుక్తులైనట్టి
శూద్రులును। సరసులు సత్కవీశ్వరులు పాఠకులు। కాముకులును వారకాంతా
జనంబు। కామితార్థము లెల్లగలుగునంగళ్లు। నానావినోదము ల్నడుపు నా
టకులు। మానినీపతిభక్తియుతులైన సతులు। దురము నమించిన మగలును మిగు
ల। మదగజంబుల నిల్పు మల్లులు గలిగి। పురుహూతు డేలిన పుర మొకో యనగ।

ధరణిదేవికిముఖదర్పణం బనగ। పురములకెల్లనుభూషణంబగుచు। నిరుపమ
గతినొప్పునిషధాపురంబు।అప్పురాధీశ్వరుడమలమానసుడు।భూపాలచంద్రు
డుభుజబలోన్నతుడు। గర్వితపుగజకంఠీరవుండు। సర్వజ్ఞుడత్యంతసాహసోన్న
తుడు।నాకేశనుతకీర్తినలచక్రవర్తి।యేకచక్రంబుగానేలుచునుండె।వారక
నెలమూడువర్షములుగురియు। జారులులేరనాచారులులేరు। విరసంబుతీరి
పెంబువెతకినలేదు।వరునతోకలహించువారునులేరు।అంగహీనులులేరరసి
చూడగను। అంగజునకైవడినమరియుందురు। నూరుగూండలకుమున్నగ
రూకవడ్డి। యేరుకిర్వదివాలుగెద్దులుదున్ను। పదిపాళ్ళకొకపాలుపార్థివేం
ద్రునకు। కొదవతొమ్మిదిపాళ్ళుకొనుపంటకాపు। యొలయుచుపుట్టికి నొక
రూకపన్ను। గలిగివర్తించునాకాలంబునందు। నిలనవగ్రహదోషమెన్నడు
లేదు।పలుమారుదున్నకపండుసస్యములు।గోవులుపితుకకగురియుచునుండు।
నేవేళభరామిపాలేరులుగలిన।కూర్మిసస్యంబులగూడిసహించు। ధర్మమునా
లుగుపాదంబులనడుచు।హరిహరబ్రహ్మాదులద్భుతంబంద।ఇరువుగాయేబదియా
రుదేశముల।ధరణీశ్వరులచేతదగినకప్పముల। నిరవొందగైకొనినిలయేడుదీ
వు। లేరకగాయకపురోహితులునాశ్రితులుపరమపావనులైనబ్రాహ్మణోత్త
ములు।మతిమంతులైనట్టిమంత్రిపుంగవులు। నతిభక్తితోగొల్వనావిష్ణుచక్ర।
మలయుచుపంపుసేయగనలాధిపుడు।చిరలీలరాజ్యంబుజేయుచునుండె। నంత
టనాదేశమందొకయెద్దు।వింతిగానడవిలోవిహరింపుచుండ।కనుగొనియొక్క

**నిషధాపురంబునందలివ్యాఘ్రముయెద్దుపైశపథంబుబూనివచ్చుట**

వ్యాఘ్రముదోర్వలేక। మనమునకోపంబుమల్లడిగొనగ। పలికెనోవృష
యంతభయమునులేక। వెలయునాయడవిలోవిహరించుటెట్లు। చెలరేగియే
నుగర్జించితినేని।యిలమృగసంఘంబులెల్లభీతిల్లు। నీబాహుబలమెంతనీవా
రలెంత।నాబాహుబలిమికినరులెంతవారు।కలగినన్నింతగైకొనకీవు।వలరెడు
బలినైతెయుందులకేమి। ధారుణినలునిసత్యంబునగాదె। యీరీతిగర్వించితిది
యెంతనాకు।నలరాజుసత్యమెన్నాళ్ళువర్ధిల్లు। నిలనెట్టిరాజేంద్రులెందరోతొ
ల్లి। ఏలిపోయినవారలీనలుడెంత। గాలంబురాజ్యభోగమునవర్తించు। నేవి
ధంబుననైననేనిన్నుబట్టి।వావిరివాగోళ్ళవడిడొక్కజించి।గొబ్బునకుతుకగొ
రికిరక్తంబు। నుబ్బుచుమరిగ్రోలకున్ననేపులికి। పుట్టినవాడనీపుడమిలోపలను।
యనిబుట్టుపులిబల్కనంతకోపలను। ఘనవృషభేంద్రుడుగర్జించిపలికె। వా

యివ్యాఘ్రమునీకనుచితమాయిట్లు । న్యాయంబు యన్యాయవాక్యంబు ।
పలికితినామదిభయమేమినాకు। ఇలలోయానళోర్వీశు రాజ్యంబు । సేయంగ
యిటువంటిసేతలునీకు। పాయక బలుకంగ పంతమానాతో। నీయానని టువంటి
నీతులుదప్పి। హాయ్యేటి వేళకీబుద్ధిపుట్టించె। సకిలించెనోవిది పాపంబుయనగ।
పులికుల్కపడ నేలనుర్విలోవినుము। ఎలుకలుపిల్లులు యేనుగల్మరియు । వల
నొప్పసింహములవైరంబులేక। ఇచ్చవచ్చినచోటనీవనంబునను।మచ్చరంబు
లులేకమహినివర్తించు।ననవిని వ్యాఘ్రంబునంతగర్వించి। జననాథుసాక్షిగా
దిండునిన్ని పుడుఎన్న గానీసత్యమిప్పుడువచ్చిన న్నేమి సేయునువనరంగననుచు
ఆగ్రహంబున లేచియానలింపుచును।శీఘ్రంబువృషభంబుసిద్ధించెమనకు। అని
తల్చిపైగాగనంతలోపలను।ఘనగిరులదరదిక్కరులెల్ల బెదర। సురలరుదంద
రక్షోతతిగుంద। నరులుజింతిల్లకిన్నరులుభీతిల్ల । దివిజులువెరగంది దివినుండి
చూడ।భువియెల్లగదలనంబుధులెల్లగలగ। పెనుపర్వుతోడగంభీరంబుతోడ
వినువీధిబరతెంచివిస్మయంబుగను। నరగునవావిష్ణుచక్రంబుబోల్కి। కరిగాచి
నక్రంబుఖండించినట్లు। తక్కక వ్యాఘ్రంబుతలద్రుంచివైచి । గ్రక్కునకమ
లాక్షుకడకునేతెంచె।నటుగాననారాజునతులసత్యమున।పటుగతిదోషముల్
పలుకంగనేగ।నతివేడ్కరాజసూయాశ్వమేధాది। క్రతువులుచేసియుకమలా
సనాది। దేవతలెల్లకీర్తింపశోభిల్లి। ఈవిధంబునజగంబేలుచునుండె। నంతట
కొన్నాళ్లకతిచిత్రముగను।సంతతకతినివసంతకాలంబు। చనుదెంచిమందార
జంబీరములను।పనసపిప్పలనింబపారిభద్రములుచందనపున్నాగసహకారము
లను।కుందకురంటకకోవిదారములు।లుంగలవంగమాలూరవృక్షములు। సం
గతిఖర్జూరచంపకంబులును।సురపొన్న లునుమంచుచాపోతములు।కురువక
న్నులుగేదగులునశోకములు।పుల్లమామిళ్లుకర్పూరభూజములు। నల్లసియర
టులునారికేళములు। నారదపాటలీనాగతింత్రిణిలు। గోరెంటలరటులుకుట
కుటభూరుహము। లాదిగాగల్గినయారామభూమి। పాదుగానప్పుడేర్పరుపంగ
నాకు।రాలియొక్కటఃతిరమ్యమైయుండి। యాలోనచిగురించెనంతలోగాచె
పూచిఫలించెపుప్పొడిచల్లగాలి।వీచినేలనుత్రావాలెవింతవింతగను। పలుమారు
పలుమారుపచ్చవిల్తుండు । అలరుపువ్వులతూపు లందందనేయు । పవడంపు
చాయజొప్పడునాసికముగను వవహేమమయమగునవ్యపత్రములు। విమలస
ర్వాంబులువిమల నేత్రములు। నమరంగధవళమయంబగుమేను। నరుదుగాగను

గొనియవనీశ్వరుండు,నరసతజేయుననంతునిపూజ, కడువేడ్కతోఁజూడఁగావ
చ్చెననగ,సురుచిరతనవినుండిమెల్లకనకపుఁ,వసుమతిపైనుండవచ్చెనోయనగ,
పొసగనంబరలక్ష్మిబూనుముత్యాల,హారంబుజారెనోయవనికినసగ, క్షీరాబ్ధి
తరలగచెన్నువహించి,యాకాశముననుండిహంసంబుపిండు,భూకాంతుముం
దరబొందలుచువ్రాలె, వ్రాలినజూచిభూవరుడుహర్షాబ్ధి, దేలుచునపుడుమం
త్రికిట్టులనియె,నెందుండివచ్చెనోయారాజహంస, లందంబుజూచిననతివేడ్క
బుట్టె, నొకహంసబట్టుకనూరకమనము, సకలంకగతినిముద్దాడుదమనుచు,

## నలమహారాజు రాజహంసంబును బట్టుకొనుట.

నతివేడ్కలేచియయ్యంచలకడకు, కుతలేశుఁడేగినగొబ్బుననెగసి, యవ్వాల
వ్రాలినవృపుడుపోనీక, నెవ్విధంబుననైననేబట్టెదనుచు,కదసిమిక్కిలికుతుకం
బుల్లసిల్ల,పొదలినమఱిపొంచిపొంచిపోవంగ,కనిపక్షులన్నియుకడుభీతినొంది
చనియొకమ్రానిపైచయ్యనవ్రాలె, వానిసంగతిజూచిననుధీశ్వరుండు, వీని
బట్టగనెద్దివిరకమునకు, తలగకత్రొలగకదనరెడునేర్పు, దొలగమానెక్కి
త్రోలునీవు,పనుపడనేనబట్టెపట్టెదననుచు, ననిననాసచివుండునాభుజమెక్కియ
నురక్తిఁబక్షులనదలి।పనివియమునమున బెదరుచుమహిమీఁదవాలె। వ్రాలినక
నుగొనివసుమతీశ్వరుండు। పాలించితనమంత్రిపతివేగముజూచి దిరిగివచ్చెనీ
వొక్కదిక్కునసుండి। తగిలినపులుగులఁదఱుమతోడబట్టు। మనవుడాభూరమహా
యాతండుడగ్గి।గొనకొనియొక్కదిక్కుననుండిడిండి। యనురక్తిపక్షులకడ్డమై
నిలువ, మనుజేశ్వరుడువానిమఱిపోవనీక, నల్లనల్లనమహీసరుదెంచిపొంచి।
మెల్లనేయొకదానిమెడబట్టుకొనియె, కడువేగమున లేచికడమరాయంచ, ల
డలుచునొకభరారుహంబువ్రాలె। చెలువనలరాజుచేజిక్కబడ్డ, పులుగు
లరాజుపొంపుడిగిభీతిల్లి, పలుమారుదలపోసి భావంబులోన, గలుగుచుమే
మునిక్కడికినేతెంచి,లటుపసనీని చేదగులంగగలిగె, కటకటాయాకీతిగాజేసి
నట్టి,బలువైననాప్రవాలఫలమునేమందు, చలమునను రాజనంబునన్నృపతి, ప
మేమిసేయునోయెఱుగంగరాదు, యేమైనమేలింకనేమునవచ్చు,ననిహంసచిం
తచేనడలగానాత,డనురక్తితోరాజహంసనుజూచి, కనుగోరదువ్వియక్కువ
ముద్దుబెట్టి। యొనరంగకన్నులనొత్తివాలించి। యక్కునజేర్చితియ్యనిమాట
లాడి। చెక్కిలినొక్కిమచ్చికజేయుచుండ।కనుగొనిసంతోషకరమగునట్టు మ
నుజేశుతోవచోమధురతబలికె। నవనిశధమముంతియునిమెడుకాంత, సువిధ

(రాజహంసంబు నలరాజుతో దమయంతిని నీదు భార్యగావించెదనని చెప్పుట.)

జేసెద నీకునోసగి నన్ను విడువు। తగు నీకు దమయంతి దమయంతికీవు। తగుదువు
నామాట దబ్బరగాదు। సారసభవుడు నీ సౌందర్యమునకు। భోరన భువి దాని బు
ట్టించె మున్న। నేగతినైన నా యింతిని జేరి భోగ దేవేంద్ర నీపాలతి జేసెదను। తలకా
ని యీ వేళ తగవట్టి మాట। బలికి పోజూ చేటి బక్షివిగాను। ఈపక్షి చేత వేగమానట
న్చు। భూపాలచంద్ర నీబుద్ధి నెన్చకుము। నీచక్కదనమును నీవిలాసమును ఆచకో
రాక్షికిన మరుభూపాల। నామాట నిజముగా నమ్ముము మదిని। కామిని నీసొం
ముగా జేయ నేర్తు। దమయంతి నీచక్కదనము నిదలచి। సుమబాణ వేదన స్రుక్కి
యుండియును। నీపాదపద్మముల్ నిరతంబు గొలువ। నాపద్మగంధి నీ నతివ జేసెద
ను। కమలాక్షునాన నాకన్నులయాన। దమయంతి నీయింతి తప్పదీమాట। నావు
డు ముదమందిన నరలోకనాథు। డావేళ నాశ్చర్యమందియాపక్షి। నతివేగ విడచి నె
య్యమున నిట్లనియె। నతివేడ్కతో నీవాడిన మాట। వినగ నా చెవులకు విందయ్యె
నేడు। నెనయ దా దమయంతి నేగతి నీవు। నెరుగుదు విలలోన నే రాజపుత్రి। తెరగొ
ప్ప నవనిలో తిరిగెడు మీరు। రాజకన్యకల వర్తన మెరుంగుదురే। రాజహంసోత్త
మ రమణీలలామ। నెలమి నా యింతిగా నెట్లు జేసెదవు। తెలియంగ సెప్పుమా తె
రగల్ల మాకు। హంసరూపంబున నరుదెంచి మున్న, కంసారి జలజాక్షి కరుణించి
నట్లు, హంసరూపంబున నతివేడ్క నాకు। హంసయానను గూర్ప నరుదెంచి
తివా। పాలును నీరును నేర్పరుపంగ నేర్చు। జాలిన పక్షి రాజవుగా వె నీవు। మనుజ
భాషల రీతి మహిలోన పక్షు। లెనయంగ బలుకునె యెక్కడనైన। పక్షివిగావు
నాపాలి దేవతవు। ఈక్షితిలోన నాయెలనాగ జనన। మంతయు నెరిగింపుమనవు

## దమయంతి జన్మవృత్తాంతము.

డుపక్షి। వింతగా నా రాజవిభున కిట్లనియె। ధరణీశ వినుము విదర్భపురంబు। కరమ
రిధి జగతి ప్రఖ్యాతమై యుండు। నాపురాధీశ్వరుడమల మానసుడు। భూపాలచంద్రు
డు పుణ్యావర్తనుడు। భీమభూపాలుడ భేద్యుడు త్తముడు। శ్రీమించ రాజ్యంబు సే
యుచునుండె। ధరణీశ్వరువకు సంతానంబు లేక। ధరణీసురార్చన లప్పుడ జేసి। తప
ములు జపములు తగిన దానములు। నుపవాసములు పెక్కులొనరించి యలసి। క
డలేని దుఃఖసాగరమువ మునిగి। పుడమీశుడాస్థానమునకు నేతెంచి। యురుదైన
రత్నసింహాసనోపరిని। ఇరువంద గూర్చుండి హిత పురోహితుల। గాయక వంది
మాగధ మంత్రివరుల। నాయుత మతి జూచి యప్పుడిట్లనియె। వినుడు సన్తానమేవి

క్షమునగలుగు, ననిభూసురావళినఖిలదానముల, నొనరించితినిమఱియుచిత
మార్గమున, తనయెందులనుసంతతిలేకపోయె, నిరవైనసంతానహీనుడైనట్టి
నరునకుదూరమౌనాకేశపదవి, సుతులనుబడసినచూచియుండంద, పితృదేవ
తలనుసంప్రీతినొందెదను,వసుధయీతనువులెవ్వరునమ్మినారు,పొసగినయీ
రాజ్యభోగంబులేల,మనమారతనయులమధురవాక్యముల, వినగనేర్చనియ
ట్టివిమలాత్మునకును,వీణామృదంగాదివిస్వరములు, వేణునాదములైనవినని
పుగావు,విడువకిప్పుడుమునివేషంబుదాల్చి, తడయకనిపుడుసంతానార్థియగు
చు,తరుణితోగూడుకతపమునకరిగి, పరగంగపుత్రులబడసివచ్చెదను,మంత్రి

భీమభూపాలుడు సంతానార్థియై తపంబునకరుగుట.

కోవిదులారమహిమనరాజ్య, తంత్రంబునడుపుడు తగనేనువచ్చు, నందాక
యునిబల్కియపుడుభూసురుల, నందరరావించియతిభక్తిమ్రొక్కి, భటపరి
చారికప్రకరంబులకును, తటుకునతనదువృత్తాంతంబుజెప్పి,పుడమికాపులకు
నేర్పడబుద్ధిజెప్పి, పడతియుదానుపరమహర్షమున, చెలువుమీరగనార
చీరలుగట్టి, తెలివిభూతపైనిండతిరముగానలది, కురులెల్లజడలుగాకూడంగ
జేసి, పురమువారెల్లగుంపులుగట్టిచూచి, యారాయనంగ ఘోరారణ్యము
నకు,ధారుణీభర్తమోదంబుననరిగె, ఫలములుదళములుభక్షించికొండ, బి
లములవిలసిల్లిభీతిల్లియిట్లు, కొన్నిదినంబులుఘోరాటవులను, క్రన్ననవిహ
రించగానొక్కనాడు, తనశిష్యులునుదానుదమనమునీంద్రు, డనురక్తిమీర
గానచటికివచ్చె,వచ్చినమునిగాంచివసుమతీనాథు, డచ్చుగాసాష్టాంగమొప్ప
దర్పించి, పలుమారుమునినాథుప్రస్తుతిశేయ, తలపునమెచ్చియాతపసియి
ట్లనియె, నెక్కడవిహరింతురెప్పుడుమీరు, నిక్కాననంబుననెన్నడుగాన,త
లపోసిచూచినతాపసవృత్తి, గలిగియున్నదిరాజకళలు మీయందు, నమరి
యున్నవిమీరడవిలోనిట్లు,క్రమమునవిహరింపగానేలమీర, లెవ్వరోయనిన
భూమీశుడాతపసి, ఇవ్విధంబంతయునటచెప్పదొడగె, తాపసవర్యవిదర్భపు
రంబు, నేపాలమీదయనేలెడువాడ, నీపద్మగంధినాయింతియైమెలగు, నా
పేరుధరభీమనరనాథుడండ్రు,పరగసంతానసంపదలేకనాకు,ధరణిపాలింపంగ
తోగదలుగాన,తపసివేషముదాల్చితరుణితోగూడ, తపముసేయగమదిదలచి

దమనమునీంద్రుడు భీమభూపాలునకై తపంబొనర్చుట.

వచ్చితిమి,నావుడువినిమునినాథుడాభీమ, భూవల్లభునిజూచిపొలుపొందబలి

క, భూమీశ మావనంబునకు నేతెమ్మ, తామసింపగ నేనుతపముగావించి, వన
జాసనాదిదేవతలచేవరము, గొనివచ్చియిచ్చెదకొదువ లేకుండ; ధరణీశయంత
సంతానంబువడసి, యిరవొందపురమున కేగుదుగాక, ననిదోడుకొనుచునిజా
శ్రమభూమి, కనురక్తిచనుదెంచియతిఘోరతపము, గావించగామెచ్చికంజా
తగర్భు, డావేళతనకుప్రత్యక్షమైనిలువ, మునికులచంద్రుండుముదమందిబ్రహ్మ
గనిసన్నుతులుజేయకమలజుడనియె, నిదిఏమిమునినాధయింతగానీవు, పదవడి
ఘోరతపంబుగావించి, నేమికార్యమువచ్చె నెరిగింపుమనిన, భీమనాముండ
నప్రియశిష్యుఁడొకడు, లోకేశకలడుభూలోకనాయకుడు, ప్రాకటంబయినసం
పదలెల్లబాసి, సంతతిలేనివిచారంబుతోడ, నింతియుదానుమాయొడకేగుదెం
చె, నతనికిసంతానమర్థిఁదోనిచ్చి, యతివేడ్కరక్షింపు మనవుడుబ్రహ్మ

బ్రహ్మ భీమభూపాలునకై దమనునికివరంబిచ్చుట.

పొలుపుమీరగనొక్కపుత్రిపుత్రుండు, గలడంచుజెప్పి వేగంబునవరిగె, నంతట
దమనమహామునీశ్వరుండు, వింతగాభీమభూవిభునివీక్షించి, కుతలేంద్రనీకొ
క్కకూతురుకొడుకు, నతివేడ్కగల్గుదురరుగుముపురికి, ననవుడుసంతసమంది
యారాజు, మునినాథునకు రేడ్మ్రొక్కియిట్లనియె, దమనమునీంద్రనీదయచే
తనాకు, క్రమమునసంతతికలిమియుగలిగె, నవిసన్నుతులుజేసియవనీశ్వరుం
డు, తనసతితోగూడితనపురికరిగియేలుచున్ననాతదనంతరమున, పరువడియా
రాజపత్నిగర్భంబు, ధరియించిముందరతనయునిగాంచె, తిరగొప్పమరికొన్ని

దమయంతి జనించుట.

దినములవెనుక, తనయనుగాంచెనాతరళాయతాక్షి, జననాథచంద్రుండుసం
తోషమంది, దమనాఖ్యుడనుపేరుతనయునికొనగి, దమయంతియనుపేరుతన
యకునొసగి, కొడుకుకన్నసుముద్దుకూతురుమీద, పుడమీశుడతివేడ్కపొ
లుపొందుచుండె, క్షీరాబ్ధికన్నియచెలువొందినట్లు, మీరిభూధరపుత్రిమెలగు
చున్నట్లు, తరుణివర్తించెసౌందర్యసంపదను, ధరణీశయబ్బాంగిదమయంతిపుట్టి
నెరుగుదుమున్నెనేనేగతినైన, యిరువందదానినీయింతిజేసెదను, మానవా
ధీశయీమాగువనీసొమ్ము, నేనాడుమాటలునిజమనినమ్ము, మనియంతబలికిన
నంతయారాజు, వినిమనంబునచాలవిస్మయంబంది, బలువిడినానందబాష్పము
ల్చాల, పలుమారుదొరుగనప్పుత్రీవల్లభుని, చేకొనికౌగిటచేర్చి ముద్దాడిభూ
కాంతుడప్పుడాపాలపిదగ్గరకు, నతివేగపోయిరమ్మనివీడుకొలప, శతపత్రముల

వలువుహంసలను, రయమున నాహంసరాజుకూడుకొని, పైనమైయాత్రోవ
పైవంబునిలువు। నేయకనలునికా చెలిగూర్చుతలపు, ద్రోయక భూమికాంతు
నిమీఁదిభక్తి, బాయక నాకటబడితమ్మితూండ్లు, మేయకనీడలమెలగంగలేక,

## దమయంతివనవిహారం బొనర్చుట.

భూపలయంబుపాలుపొందునట్టి, యావిదర్భపురికినరుగుచుండ, నచ్చట
దమయంతియతివలుదాను, విచ్చలవిడివనవీథికివచ్చి, కలయంగశుకచారిక
లుమయూరములు, బలుకుచుండగ వానిపలుకులువినుచు, పూచికాచినమం
చిపుష్పవృక్షములు, జూచియింతులకునుజూపినవ్వుచును, యలరు తేనియ
లందిగ్రోలుచును, యలరుపూచినగురులనరసినవ్వుచును, చల్లనగాలికిసంతో
షపడుచు, పల్లవంబులనెల్ల పరికించిగోనెడు, చెలులలోనమితారికలికికటారి,
చెలువులవంకవాసలపూలబొంకి, చెలియలమేల్బంతిచిత్తజుబంతి, వలపుల
బొంతిసేవంతిపూబంతి, మరునిపట్టపుచిలుకమరువంపు మొలక, అరుదువు
ప్పొడిదిన్నె అమృతంపుగిన్నె, కంమతావులటావుకళలకునెలకు, కంమతేనియ
బావికపురంబుగ్రోలి, సొగసువజ్రపుతళ్కుసొబగులబెళ్కుపగడంపులతకూన
పన్నీటిసోనచిలుకలకొల్కి యాచిగురాకుముల్కి, కులుకుముద్దులగుమ్మగొ
జ్జంగిరెమ్మ, యనిచాలకొనియాడనన్నిటదగిన, వనజాక్షి శృంగారవసముకా
పలను, కదసికెంపులురవల్ కాంతులజిమ్ము, నుదుటబంగరుసొమ్ము జడలం
దుమెరయ, జలజలోచనలగుసఖులునుగొలువ, నలరుచుదమయంతియతివే
డ్కమేను, తెలియనివలవినోదింపుచుండ, కలహంసలపుడు వేగంబునవచ్చి,
రమణులతోడనంభ్రమ కేళినుండు, దమయంతియెదుటనందముమీఱవ్రాలె,
నెలతచేనడువులునేర్చుకోదలచి, కలహంసలీరీతికదిసెనోయనగ, వ్రాలిన
యంచలవలనొప్పజూచి, మేలనిదమయంతిమెలతలుదాను, నప్పుడుగనుగొని
యాశ్చర్యమంది, యొప్పులకుప్పలైయొప్పిచలంగు, నారాజహంసల నవుడు
పోనీక, బోరునతరుముక బోఇయందంద, పొలతులందరుపొంచిపొంచిపోనీక,
చలమునసన్నిహయంచలబట్టిరంత, యారాజనందనయారాజరాజు, కోరిపట్టిన
యంతగొబ్బునబట్టి, యక్కునదిగియించియవుదలనిమిరి, చెక్కిలినొక్కిము
చ్చికముద్దుబెట్టి- మెల్లనదువ్వుచుమృదులోక్తులాడ- యల్లగనుగొని యా

## దమయంతితో రాజహంసంబునలునిపురుషునిగావించెదనని చెప్పుట.

యంచపలకె, మానవభాషలమధురమైయలర మానినినీకొక్కమాటచెప్పె

దను।విడువుమననునీకు వేగముగలుగు।పడతినీరూపుసంపదజూచినాకు। కడు
వేడ్కబుట్టెనిక్కముగ నామదికి। నుడుగక వినుమునీకొకటిజెప్పెదను। రంగై
ననిషధపురంబేలు రాజు।శృంగారవంతుడూర్జితసత్యధనుడు।నరలోకనుతకీ
ర్తినలచక్రవర్తి। కర మొప్పవిష్ణుచక్రముపంపుజేసి। యిలనేడుదీవుల నేలడు
రాజు।నలకూబరునికన్నవవిల్తుకన్న। సరసిజభవుకన్న జలజాప్తుకన్న। హరుక
న్న బలదైత్యహరుకన్నమించి।ధరణీచెనొప్పిందునుతరళాక్షీనీకు। సరియైనవా
డమ్మసౌందర్యశేఖ। రమణినేజూడనిరాజులు లేరు। రమణిరోయటువంటిరా
జునుగాన। కలకంఠనీవంటికామినీమణికి। వెలయంగనలరాజు విభుడుగావలె
ను।నాకుజూడంగనోనలినాయతాక్షి। చేకొనుమనలునినీచెలువుడుగాగనలుని
కన్నుమంచినాథుండు లేడు, నలువలరంగపదునాల్గులోకముల। వనితదబ్భ
రలాడువారముగాను।కనివచ్చితిటకునాకన్నులయాన। వానికిదగునీవువర్ణిం
పనేల। మానినినీరూపమహిమకుదగిన। వాడుగావునవిట్లువర్ణింపవలసె। నే
డునీదగ్గిర నెలతరోవాని।పొసగినబంగారుబొమ్మనిదెచ్చి।మసిపాతగట్టుటమా
కుసంమతమె। ధరలోననోములుతగినదానములు। చిరభక్తిపూజలునేతురు
మంచి। పతులుగావలెనంచుభామినీమణులు। అతివరోనీదుభాగ్యంబున కేమి
కొడువెనీనాథుడీకువలయాధిశు।డదిగాకవినవమ్మయవనిలోపలను।నలరాజు
చక్కనివాడంద్రుజనులు।చెలియాయనంగుమించినవాడునలుడు। కలికిమా
రుడునీటుకాడనుకుంటినే। తలపులోపలవానిదలచిచూచినను। దురితకర్ముడు
శివద్రోహిదుర్జనుడు। హరికుమారుడుగాననతనికిచెల్లు। నదిగాక వినవమ్మ
యామహీశ్వరుడు। పదపడిహరిహరబ్రహ్మాదిసురలు। దీవింపనిల యేడుదీవు
లనేలు।కావునవానిచక్కదనంబుదెలుప। నాపంకరుహయోనికైనశక్యంబె।
యోపద్మనయననీకొప్పునాథునుడు। పతిగోరియతివరూపమున జన్మించు,
నతివానిబొందనిజన్మమేమిటికి। ఆరాజవరునికిల్లాలవై తేని। యోరాజీవదపనీ
యునికికిదగునె। యలివేణియోగతినైననునలుని। వెలయంగప్రాణవిభునిగా
జేతు। ననియివ్విధంబుననానలాధిపుని। వెనుకొన్న భక్తితోవేవేలగతులు,
దలపోసివర్ణింపదమయంతియంతి। పలుకులకానందపరవశయగుచు-కన్నుల
బాష్పంబుకణములుజొబ్బిల, చన్నుగుబ్బలమీదజలజలధారగ, తనమేను
పులకించితలయూచియెంచి, యనురక్తివిడచినెయ్యమునకిట్లనియె, రాయం
చ రాజయా రాజ దేవేంద్రు - జేయుడ నుండునీ వెక్కైడుంగుడువు।

పులుగుల రాజవు భూపాలు డతడు, తలపోయనీకు వాతని చుట్టరికమే గతిగలిగెనాకింతయు దెలియ. వేగంబె జెప్పుమా వీనులుదలియ, ననవుడు రా

## — రాజహంసంబు తనకునలునికి సఖ్యంబైన విధంబు జెప్పుట. —

యంచయాయంచగమన। గనుగొనిసంతోషకలితమై బలికె। వినవమ్మ చెప్పె దవిశదంబుగాను। జనలోకనుతుడు సజ్జనలోకహితుడు। భానువంశంబున బలుడై నవీర। సేనునకుదయించి చిరకీర్తి వెలయ। రమణతో నిషధపురంబుననుండి। కమలాయతాక్షు చక్రము పంపుసేయ। యెనయదీవుల నేడు నేలుచునుండి। మనుజేశుడొకనాడు మంత్రులు దాను। వరుసతో శృంగారవనములో వలను। చరియింపుచుండ నాసఖులును నేను। భరామీశు దగ్గర బోయ్యవాలితిమి। యామోదముముజూచి యాచక్రవర్తి। కరుణారసముజిందగా నన్ను బట్టి। కర మొప్ప లాలింపగా నామహీశు। చక్కదనంబును జవ్వనంబతిని। మక్కువను గుణసంపత్తి భాగ్యమును। చూచి నామనసున శుభముఱెట్టింప। యీచక్కదనమునకిల్లాలువలయు। ననుచుని రాజునకనుకూలమైన। వనిత దెచ్చెదననుచు వసుధపై నొప్పు। తరుణీమణులచక్కదనమెల్ల చూచి। సరిపోవకి చటికి చనుదెంచునీదు। వరరూపవిభవలావణ్యసంపదలు। పరవిజరాడగ మాకు సంతోషమయ్యె। నదిగాననలునివృత్తాంతంబు నెల్ల। విదితంబుగా నీకు వివరించితిపుడు। నెలతయెటున్నదో నీచిత్తవృత్తి। తెలియగ రాదమ్మ దేవసన్నిభుని। నలునివరించి మన్ననగాంచి తేని। నలరునతావియు నలరనట్లుండ। నరలోకమందు నానరనాథునంటి నరనాయకుడు లేదు నరనాథపుత్రి, కల్లలుబలుక నాకన్నులయాన, పల్లవపాణి నీపాదంబులాన, సత్యంబు నామాట సత్యంబు సుమ్ము, సత్యమే జయమని సకలయత్నముల, పలుకుదురిలలోన పావనమతులు, తలపోసిచూడ మో తరళాయతాక్షి, యనవుడు మదిరాక్షి యాపక్షిరాజు, గనివిస్మయానందకలితయై పలికె, నోపక్షిరాజేంద్ర మోదయాసాంద్ర, నాపాలి శ్రీరామనాథుండవీ

## దమయంతి నలుని దనకు పురుషునిగావింపుమని వేడుకొనుట.

వు, రక్షింపగదలంచి రయముదవచ్చి, యాక్షితీశ్వరుని నమ్మగువనలాధిపుని, నలరాజచంద్రుని నానాథుగాగ, చెలువంద జేసి రక్షింపవే నన్ను, ఇరవొందనీమాట నేజవదాట, నరుదార నారూపమంతయు రాజ, వరునిలో పలుమారు వర్ణించి చెప్పి, సరవినీవిచటికి జనుదెమ్ము పొమ్ము, చెలగినీవింతగా జెప్పుచున్నగను తలపోసి యేనువింతకు నోడంబడితి, నికనొక్కమాటనీ కెరిగింతు విను ముక, పక్షి

టితగతినేనుప్రతిభనోవర్చి। నలునకుమనువొందెనలుడొల్లననిన। వెలయుని
ప్రాణంబువిడుచుటయుండె। ఘనతరబుద్ధిత్రికరణంబుగాను। పనిబూనిపలికి
తిపణతినామాట। పూనికఁకోసన్యభూములనేలు, మానవాధిపుగూడిమను
దానుగాన ఇంతేసిపనులకునెడముగానీక, కంతునిశరములగాసిల్లనీక , కు
సుమాస్త్రకేళికిగుందంగనీక, వసుమతీపతికినావర్తమానంబు , తేటలెల్లం
బుగాదెలియంగపలికి , మాటలురీతిగామరికొన్ని జెప్పి , ఏవిధినైనశాయిన
కులాధిపుని, వేవేగనాప్రాణవిభునిగాజేయు , మనిప్రియవాక్యంబులంతంత
బలుకు। వనితనుజరాచియవ్వలపక్షిబలికె , కలకంఠీనీవింతబల్కంగనేల ,
తలపనికార్యమంతయునాదిగాదె, వలనొప్పనలచక్రవర్తికిదగిన, కతికినెన్న
డుజరాడగలుగునోయనుచు, తలవుచునుందునోతరళాయతాక్షి , పలుమా
రునినుజూడభాగ్యంబుగలిగెనటుగానపలుమారునడలనేమిటికి, తటుకుననలు
నిసీధవునిచేసెదను, యొద్దికమీకార్యమొనగూర్చెదనుక, నిద్దురమేడదేని
లతరోనాకు, వనితమేమటువంటివారముగాము, మనమునగుందకు మనుజే
శుగూర్తునని చెప్పితనవారినందందవిడువు, మానినీవువిరహాగ్ని నడలంగవలదు
చనుదెంతుమరలనిచ్చటికంచు దెలిపి,వినువీధివరిగెనావిహగేంద్రుడచట , ధ
రణీశ్వరుడుభీమతనయునిదలచి , నలరువిల్తునిఱుంప వేదనకులికి, విరహాగ్ని

నలుడువిరహాగ్ని నింగుందుట.

చేగుంది వేసటనొంది, సురపొన్నవీడభాసురముగానొక్క-చలువ పూపందిలి
పరగ వేయించి, ఘోలుపండపచ్చకర్పూరంబుదన్నె. పరిపించిదానిపైపన్నీరు
జల్లి, పరవుగాచిగురాకుశాన్పుగావించి, కొత్తకస్తూరింపుగగూర్చినమంచి
మొత్తనిగంధంబు చెయినిండబూసి, తావిపన్నీటనుతడవినపచ్చ- సేవంపిపూ
రుల్పెచ్చెరబూనిమరు వేధకోర్వక తురిమరికరిగి, పరతెంచియూపాన్పుపైనపవ
ళించి,తను వెల్లభాగులచింతావార్ధిమునిగితనలోననిట్లనితలపోయదొడగెలం
చలుబోయినయంతనుండియును, పంచబాణుడునాకుపగవాడునయ్యె, నేమి
సేయుదునింకనిటమీదనాకు, కామాక్షికడకునెవ్వరిబంపువాడ,జడజారిభ్రా
మయింపజాలినముద్దునలినాక్షిసుఖమునెన్నడుజూడగల్గునడుగంగ తేనియ
నొలుకంగబలుకు,పణతిరోనెన్నడుభాషింపగల్గునలివేణితియ్యనియధరామృ
తంబు, నలతదీరగనెన్నడానానందగల్గు, ముదమొప్పమదిలోనముచ్చటదీర
ముదితనెన్నడునాకుముద్దిడగలదు, యలరనాచేతులయానలుదీర-పొలతిపొ

లిండ్ల నెప్పుడుపట్టపగలు।కవగూడిరతి కేళికాంతులుప్పొంగ। నువిదకౌగిట నెన్న
డుండంగగలుగు।శ్రీనాధయనియిట్లుక్షితినాయకుండు।మానక నడలికంమర
దంచదలచి।బొరలుచునెక్కడబోయెనోయంచు। సరసులస్నానపాబ్జంబులుగాం
చి।మరిగియుంతటనన్ను మదిలోనమరచి।యొరసిభక్షింపుచున్న దోయంచు।
యనరంగతామేగునట్టి త్రోవలను। తమవారిగనినన్ను తలచదోయంచు। త్రో
య్యాలితో నేర్పుగొడభాషించి।బయ్యానవచ్చుచుయున్న చోయంచు। తరమిడి
నామీదదయనేగుచుండి।పగవడిఅడవిలోబడలెనోయంచు। ఏమియు తెలియు
రాదింధాకవక్షి।యేమిరాయిచటికి నేలరాకుండ। నమమెచ్చనూర్పుచుహా
రమానాథ।యతనితలచుచునుండ నప్పుడాయంచ। చనుదెంచిసఖులతో చ
య్యనవ్రాలి ఘనభక్తినలరాజుగనుగొనిపలికె। సమరనీయానతినిచ్చోటికే
గి, దమయంతిగనుగొనితరలివచ్చితిమి దానిచక్కదనంబు తలపనచ్చెరువు,

రాజహంసంబు దమయంతినివర్ణించుట,

భూనాధవినుము నేర్పునవిన్న వింతు। మెరుగునీలవుసరుల్మించినకురులు, పరి
పూర్ణకళిపోముబడసించుమోము, తిలపుష్పములసొక్కుదెగడెడుముక్కు
నలినాక్షికలుహాయల్కవ్యాకర్ణములు , హరిణంబులజయించుపక్షులవం
చు। మెరుగుటద్దము బోలుమించుచెక్కిళ్లు, యులరుబింబముగవి నడగించు
మోవి, చెలువుశ్రీకరములు చెలియుకర్ణములు, ఘనమైనశంఖంబుగవయు
కంఠంబు , కనకంబుతీగెలగడపు బాహువులు , మృపల్లవంబులు మిగులు
హస్తములు, కుదురుకల్వాలమీరుగోకులతీరు, వలుదబంగారుచెండ్లువనితపా
లిండ్లు, చెలువైననీలంబుచికిలిరజంపు , నురువడితోబోరునువిదనూగారు
ధరపొన్న పూబోణితమునుమీనాభి, వసుధసింగముతోను వాదించగాను, ని
సుకదిబ్బలపొందు నెసగుపిరుందు। లరటిగంబంబులనడగించుతొడలు, మరు
నినిషంగనామ్యంబుజంఘికలు, కెందమ్మి రేకులగేరుపాదములు, నందంబుతా
ళ్ళనడరుమీగాళ్లు, వనితకునదియెల్లవర్ణనగాదు, మనుజేశ నేగొంతమా
త్రమెంచితిని, నీరాజతేజంబునీప్రతాపంబు, నీరూపవిభవంబునీవిలాసంబు,
నామరిరాక్షికినామదవతికి, నామోహనాంగికినాసఖీమణికి, నాపద్మగంధికి
నాపుణ్యవతికి, నాపువ్వుబోణికినాగుణవతికి, నాదమయంతికినంపంగమెన్ని,
మోదించిమదిలోనముచ్చటదీర, వరుసవేవిధములవర్ణింపచెప్పి, తరుణికినీమీ
దతలపుబుట్టించి, చెలియనిసొమ్ముగా జేసివచ్చితిని, చెలిమిరాజేంద్రనీకిక చిం

తవలదు,నీకుగావలెనన్న నీరజాయతాక్ష, యాకంజలోచననవనిపుట్టించె, నింత
యూనిజమని మోదించిభూనాథ, సంతోషమలర రాజ్యము చేయుమనుచు, బలికి
హంసము విదర్భకుపోవ్వుతరిని, తలపునసప్పుడాదమయంతికన్య, పలుమారు

దమయంతి విరహాగ్నినిం జెందుట.

నలమహీపాలునిదలచి, యలరుపిల్లునిపువ్వుటమ్ములకులికి, ఘనమైన మో
హసాగరమునమునిగి, తనప్రాణసఖులనుతప్పకచూచి, రాయుంచలేలకోరా
దడవాయె, నాయువనీశుడేమునియెనోగాక, హాయక తమజాతిపక్షులగూడి,
పోయెనోకాలమలబాన్దినోలేక, యుపవనంబునలోనున్నదోయంచ, చపలా
క్షియిట్లువిచారంబునొంద, నిదిమంచిసమయమియాయింతినీవేళ, గదళినాపగ
దీర్తుకడువడినమచు,తమ్మితుపాకికెందలిరాకుదంతి, కమ్మనివిల్లుచెంగల్వనేజ
యును,జాజిపూబాకుగొజ్జగిపెద్దగత్తి, రాజిల్లుచిలుకలరథముపైనెక్కి, యు
లరుతుమ్మెదలసైన్యముమున్నినడువ, పలుమారుపంతముల్పలుకుకోవెలలు,
పరవుమీరచకోరబలములుగొలువ, మరుడుదండెత్తియామానినిమీద, చ
లమునచనుదెంచినరగునగవసి, యలరువింటనుపువ్వుటంబగులెక్కించి, కర
మునదెగదీసికలికిపాలిండ్లు, గురిజేసిపడినేసికోయనియార్వ్వ, నప్పుడాపూబో
డియంతరంగమున, నుప్పిరిగొనుతాపమునకోర్వలేక, ధృతిదూలిమిగులగుం
దెడితరియంచు, యతిరయంబునవచ్చి యాతివకిట్లనియె, వూరాజవదనయా
యూర్వీశుకడకు, బోరునపోయినేర్పుననీగుణంబు, భానరూపంబు భక్తియు
ప్రియము, వావిరివర్ణించివర్ణించివాని, మనమునదయబుట్టమాటలుజెప్పి,
వనితనీపైమేలువానిగాపించి, పచ్చితినీవింకవరియింపుమతిని, మచ్చికసకల
సామ్రాజ్యవైభవము,ననుభవింపుచునుండుమతివేడ్కతోడ, వనితమేమిక
పోయివచ్చెదమమ్మ, మరువకదయనుంచుమామీదననుచు, బలువడిపలికి
యాపక్షులుచనియె, నంతనక్కడనలుండతివనుదలంచి, కాంతునిశరములగా
సిల్లియునిక, యాహారముడిగినిద్రాపేక్షమాని, యాహారిబాడుచు హాహారి
యనుచు, తనలోనదమయంతిదమయంతియంతి, యనుచుబల్కుచు వెర
గందిచూచుచును, మంత్రులుజూడకమహానీయరాజ్య, తంత్రంబునడపక ద
నరెకాల్వ, కూటంబునకురాకకూర్మిజెన్నొందు, హాటకరత్నసింహాసనా
పరిని, కూర్మిగూర్చుండకకొలువువారలకు, బేర్మిసంబళముసిప్పింపకజనుల,
మనువులువినక బ్రాహ్మణులకుధర్మ, మొనరింపక నమంగులాసగుచునున్న,

కపురంపువిడియంబు జేయక వేటకై నరుగు, వెడలసంగీతవీణామృదంగ, నినద ముల్వినకచిన్నెల లేక రాడు, ఘనమగు నాట్యసంగతిజూడ కాత్మ, దమయంతి యతులసౌందర్యంబుదలచి, సముచితగతినాప్తజనులతో ముచ్చ, టాడక తా నేర్చునట్టిపదంబు, బాడకవిరహతాపంబుననలుడు, తనయొక్క యేడుగాదీన తనొంది, యొనరవర్తింపుచుండనవ్వేళ, సచివోత్తముడుమానసమునచింతించి, యుచితవాక్కులవిభునూరార్చిపలికె, నలధారుణీతలనాథనీవిపుడు, తలపునదమయంతిదమయంతి యనుచు, పలుమారువిరహతాపమునగుందినను, నలరేగిభూజనుల్ నవ్వరేనిన్ను, నరనాథసామాన్యనరునికై వడిని, తక్షాక్షి పలుమారుదలచంగదగునె, వినుమునీవంటిభూవిభునకునిట్లు, వనితకై ధైర్య మ్మువదలింపదగునె, మదిలోన బుద్ధిమరచియీరీతి, వసుధకై పలుమారుశోకింపదగునె, ఇదియెంతకార్యమేనిప్పుడిచ్చోటు, కదలిభీమనృపాలుకడకేగియని న, నడిగియాదమయంతినమకూలపరచి, కడువేగవచ్చెదకలగకుమింక, మచ్చికతోసభామంటపంబునకు, విచ్చేయుమని వేడివిభుని దోడ్కొనుచు, సాతపం

## దమయంతి మదనతాపంబు జెందుట.

బలరనాస్థానంబు జేరె, నంతనక్కడరాజహంసలుజనిన, సంతనుండియునుభీమావనీశ్వరుని, సంతతిపుత్రిభూరాజననుతగాత్రి, దమయంతిమదనవేదనజెందుకుంది, శమియింపనేరక సంతాపమంది, నలరాజచంద్రుని నరలోకవిభుని, పలుమారు పలుమారు భావంబులోన, తలపోసి తలపోసి దలయూచి మేను, పులకించి పులకించి పూనిమోదించి, తిలకించి తిలకించి తెలియ వర్ణించి, చెలరేగిచెలరేగిచెలియవేనోళ్ళ, వినుతించివినుతించి వెలదుల జూచి, వనజాక్షులార నావల్లభుడిటకు, రాడకోమీరై నరయమునబోయి, వేడుకోరాదె నావిధమెల్ల చెప్పి, తోడుకరారాదెదోసమామీకు, వేడుకగాదె నావిభుడును నేను, జోడుబాయకనుండిసురతసౌఖ్యముల, కూడియుండగ కనుగొనరేమొమీరు, కటకటా నేనింతగాసిజెందంగ, నెటులజూచెదరుమీరెంత నిర్దయులె, పసిబాలనిటు జేయపాటిగాదంచు, కుసుమబాణుని వేడుకొనరమ్మమీర, తల్లులకు జెప్పరె యలివేణులార, నెలతనీగతి జేయనీతిగాదంచు, నలనొప్ప జెప్పరెవడికో వెలలకు, కలకంఠనిక్లేచగారాదటంచు - పణతినీగతి జేయపాడియేయనుచు। వడిచకోరా ప్రుసవారించరమ్మ। కలికినీవై ఖరివారించక నుచు। తొలుతవసంతునితో జెప్పరమ్మ। యనిపల్కి హానాథయనిమూర్ఛబో

యి। మనమున దెలిసిమన్మథుకు నామీద। నిటు సేయుదనకు నేనేమి చేసితిని। కట
కటాయని లేచుకన్నీరునించు। చలిగాలివిసరిన చాలకునలరులు రాలినయందం
దవెరచు। కడువేగ లేచియా కామినీమణులు। తొడలపైపవళించు మఃఖంబు బెం
చు। పతిరాకయుపుడు నా ప్రాణంబులుండ। వతివెలారాయనియువనిమూర్ఛిల్లి
యొకకొంత ప్రొద్దునకొయ్యన తెలిసి। యొకచోటుగోరి వేరొకచోట జేరు। నొక
చెలిపేర వేరొకచెలిబిలుచు। నొకపనికను చు వేరొకపనిదలచు। నొకమాటలా
డి వేరొకమాటలాడు। నొకచెలిబట్టు వేరొకచెలిదిట్టు। నొకపరి వెరగందునొకప
రిగుందు। చెలులనుజూచి యోచెలులార చెరుగు। విలుకాడడిగో నన్ను వేయు
చున్నాడు। మీరలందరుగూడి మెల్ల నేపొంచి। పారిపోవగనిక పట్టిగట్టిగను। విర
చికట్టుకరండు వేగ మెపొండు వెరచినవారల వెరపింతురుర్వి నను మాట నిజమా
యెనలునునివలన। ననయిట్లుభ్రమమాటలాడంగ చెలులు। వెరగందిదిగులొం
ది వేదనబొంది। మరునిదూషించి క్రమ్మరవివేకించి। మరునన నేలతామరతూం
డ్లమెసగి। చనుదెంచి కాంచిరాహంసలీరీతి। నలునకు నలుండని నయముగా జెప్పి।
పొలతినీగతి జేసిపోయియుండంగ। నేమి సేయుదమింక నిటమీదమగువ। కేమి
టమానునోయీమరుతాప। మనిచాలచింతించి యులివేశీగాంచి। గొనకొని
దగ్గిరకూర్చుండపలికె। కన్నులనిండారగారె కనీరు। మచ్చ నదుడిచి యీమది
రాక్షిగుబ్బ। చన్నులపైకొంగు చక్కగావైచి। వెన్నునకందందవిరసి చిక్క
యిన। నెరికురుల్ కొప్పుగానిగుడించి తొడల। ముకువుసనిడిముద్దుమోమున
మోచి। కదియించిలాలించి కౌగిట నునిచి। ఇది యేమి నెలత నీకిటువలెనలత।
ఇది యేమి చెలియ నీకిటువలె సొలయు। నిది యేమిలలన నీకిటువలె చలన।
మిది యేమి మగువనీకిటువలె వగువ। నిది యేమి తెరగునీకిటువలె మరుగు। నిది యే
మివింతనీకిటువలెచింత ఇది యేమియువిదనీకిటువలెబడలనిది యేమివింతనీకిటు
వలెచింత। ఇది యేమి బాలికనీకిటువలె వెలయ। ఇది యేమి భామనీకిటువలె ప్రేమ
ఇది యేమి కొమ్మనీకిటువలెనమ్మ। ఇది యేమి శరలాక్షి యింతిసమదికి। ఇది యే
మిమమతనీకిటువలె ములయ। ఇది యేమిమదిరాక్షి యింత బాలార్చ్య ఇది యే
మి యింతినీకింత విభ్రాంతి। వెరవకుమావంటి వెలదులుండగను। తరళాక్షి నీకింత
తాపంబుదగునె। యనియూరడించి తియ్యని మాటలాడి। కనుపవనీహారకర
ణములదుడిచి। చలువపన్నీరుజలకంబులార్చి। కలికి గుబ్బలమీద కస్తూరిబూ
సి। యొనరంగనిట్లు శయ్యోపచారములు। నొనరించియుండిరి యువిదకునంత

## చంద్రోదయ వర్ణనము.

నాకాశలక్ష్మికర్ణావతంసంబు। ప్రాకటంబుగ జారిపడినచందమున। తరుణామా
కిరణంబుతల్పంబులగుచు। తరణిపశ్చిమపర్వతంబునకరిగ । క్రమమునసాంధ్య
రాగముదశదిశల। రమణశోభిల్లితామరలుముకుళించె। కలువలు జెలగెచీకటి
విస్తరిల్లె। బలవైరిదిగ్జ్యోత్స్నమునకై మువల। చికిలించుముత్యాలసేసలోయ
నగ తెలకించితారకలుదివినుండి చెలగె।కవవాసిచక్రవాకంబులకలిగె తివిరిగే
హంబులదీపముల్ జెలగె। కోకచకోరపక్షులుసంతసిల్లె। జారజోరులుసంతస
మునొందిరంత। సురరాజదేవిభాసురతలతోను। ధరియించుకర్పూరతాటంక
మనగ। కలువలునవ్వజక్కవలుజింతింప। తలపుచువీరిహేలుతర్లడంబంద। ఘన
తతోపూర్వదిగ్భామాక్షినొందుచనుదెంచెనోయని చంద్రుండుబొడిచె। జా
డనెల్లడపిండిజల్లినయట్లు। వేమకగాయుచివెన్నెలగాయ। నంతలోదమయం
తియుదియోర్వలేక। చింతించిమదనాగ్ని శిఖలు చెనొంద। పలుమారు వెన్నె

### దమయంతిచంద్రునిదూరుట.

లబయిటికేతెంచి। తెలచల్వ హాతిపై నెలతగూర్చుండి। తలయెత్తిద్విజరాజుతప్ప
కజూచి। నలరాజుదలచి తేనవింటిరాజు । నమ్మబట్టియిలాతిసనలిసలినేయు। తన
కిప్పుడనేమితప్పుజేసితిని। వలదంచుమిరార [illegible] విల్కా
డునీకల్లుండుగాడె । వేవేలగతులు [illegible] నెన్నుడులు సేసి । [illegible] చిపలుమారు
ప్రస్తుతిజేయ। తనజాడమానదుర్ధర్షమేతనకు । నునగాని [illegible] యుతడొక్క
డుగాడు। తులలేనియలనసంతుండుకోకిలలు। మలయమారుతముకోమలకోరి
కలను। చిలుకలు మొదలుగా జేరిసన్నింత। దలచుచుండగ [illegible] నెయామే
ను। ముగువగ దాయనిమనసున లేక । పగచాలెడేపాటిపౌరుషంబోయి। యని
పల్కుచుండంగనంతకంతకును । వనజారి వేడిమిపడిమూర్ఛబోయి । తెలసిది
గ్గునలేచిదివిరాజుజూచి। కలుగుచుమరిద [illegible] గలవాడననుచు। నలకువిల్తునిసైన
లస్సియునీకు । తెలుపవచ్చితెమంచి తెరగుజేసితివి। నీవొక్కడవెకాదు నీ
వారలెల్ల । నీవిధమేకాదె నెంచిచూచినను । వేజమ్ముజ్జాదిన వేడుకబుట్టి।
ద్రోహకారులు గురుద్రోహులుఖలులు। [illegible] శివద్రోహులువాసి వ
రుసలెంచనిదుష్టవర్తనులనగ। హీనులుమరి కాంతిహీనులు చెడిన మేనులుగ
లిగియుష్మ్రకినిలోన। విరహిణీస్త్రీలను వెరపించుకొనుచు। కరుణయు లేకగాల
ముపలెను। దిరుగుదురిదిమహాదీరల్వమునచు । వరుసతోసవ్వేటివారలనెరు

గారవిపల్కి నీరనొయ్యనజూచి యపుడె। ఘనతరమ్ముగ పాతకమ్ము సిద్ధించు। నవిత
నతలవంచియతివెలగాంచి। వనజాక్షుపారనావల్లభునింక। నెవరుత్తోడుకవత్తు
రేమి సేయుదును। భువి నేను చేసినపుణ్యమిట్లుండె। ననికొంతగుందిహాయనిదుః
ఖ మొందె। మనమునభ్రమయుక్రమ్మరనంత దెలియు। నలునిదలంచు క్రన్నన
సంతసించు। చెలులనుబిలుచు రాచిల్కలదలచి। కిలకిలదెగడు కోకిలలకు దెగడు
కలకలబలుకుభృంగములకును లుకు। ముట్టదువీణయు ముదతసొమ్ములును। బె
ట్టదువిరిబంతి బెంపారు వేళ। బట్టదుతోడుగ గుపాటించి దైరెక। గట్టదుచక్కగా
కాంచనాంబరము। పూయదు పరిమళంబులు మేన వేడ్క। నేయదువిడియంబు
చింతతోకన్ను। దూయదు చెలులతో మురిపెటిరీతి। సేయదుచనువిట్లు చింత
చేనుదుట। తీర్చదుతిలకంబు తెరగొప్పగోట। దూర్చదుజలకేళిచూడగాసఖుల
తీర్చదు చెలులు వాదించినతగవు। పేర్చినవకేళివిహరింపజనదు। ముదువదుకురు
లుక్రొమ్ముడివెూదమలర। వి...వదు చెక్కిలివెనవానుకరము। నొదువదునలుని
నెమ్మటదక్కసుదువదుకన్నీరుదారగ సుమేటిరీముసుయాడదుసరసమ్ములబలల
తోడవిడమ్ము మనము నవిభుమీదచింత। పాడదుతానేర్చుపాటలుమదిని। జరాడ
డు తెరనలతోమాటలాడ, నీవిధంబునసున్న ఇ...తిసైషించి। వేవేగభీమభూవిభు
నకేకార్యమిపెరుంగింపకుండినవిదితెన్నగాదు। సరగునతలరాజచంద్రుడిచ్చటి
కి,దరిమవచ్చినగానిదమయంతినిపుడు। విరిశరంబుల వేయు వెడలింతుడాత్మ। ధ
ను వెక్కడింపను శరశాతులారా। యనవృనమున కేలనని యుండువదన। లప్పుడు

## సూర్యోదయ వర్ణనము.

గానివచ్చినయంతఃపురమున। గొబ్బనవిరిశయ్యనుంచిరయ్యెడను। పొలుపొంద
రవివంశమునబుట్టినట్టి। నలునిగోరినభీమనందనవిరహ। వేదనముడిగింపవేవేగ
నిపుడు । రాదలంచినరీతి ప్రాగ్దిశా కాంత । యనువు ముక్క
ర ముత్తియంబో యనంగ । కనుపట్టె ప్రాచి చక్కన వేగుచుక్క।
నొల్లనెచంద్రుండు మెల్లగల్లదక్కి। తెల్లనైపడమటిదెస కేగుచుండ। తారల
భ్రమమున నెంతయు కాంతిమాసె। జారచోరసమూహసంచారముడిగె। నల
రాజుతనవింటినడినెక్కడించె। పొలుపొందు బాణములుపొదనోనముంచె। కది
సియుండినయట్టి కాంతలువుష్ప, లదిమిన కౌగిళ్లు లందందవదలె, కలువలుచిం
తించెకమలముల్మించె,నిలుపుష్పజాలంబు నెల్లను వెలసె, సరగునసర్పసంచా
రంబులుడిగి, యిరవులలోజేరెనింపుసొంపార, కోకిలలందందగూయుంగదా

ణగె। మూకలై పులుగులిమ్ముల మేతకరిగె, తిమిరముల్ దామున్న దిశలకేపో
యె, కొమరొప్పవాల్గుదిక్కుల తెల్లవారె, తనయుని పెండ్లికి ధరణిధరారి, ఘన
తగప్పిన మేలుకట్లో యనంగ, నిందీవరాక్షికో నెలమిజయింతు, డందివసంతం
బులాడనో యనగ, నిలధరేంద్రములతో నింద్రుండుపోరి, జలజరక్తంబులు చె
ల్లెనో యనగ, నరుణోదయంబయ్యె నంతలోపలను, వరవైభవంబున వాసవుడిడి
న, కొలువులో జగజంపుగొడుగో యనంగ, చెలువొప్పుపూర్వాద్రిశిఖరంబుమీ
ద, చలమునహరి వేయుచందమో యనగ, జలరాసిపుట్టంబునతిధరియించు, పొ
లుపొందపాపటబొట్టో యనంగ, బలభేదిమెడనున్న పతకమో యనగ, నటన
తో యింద్రునినాతిపైనున్న, బటువైనచంగల్వబంతులో యనగ, భానుడప్పు
డుతూర్పుపర్వతంబునకు, మానుగాజనుదెంచె మహియెల్ల బొగడ, నంతటద

### దమయంతివిరహంబును తత్సఖులు భీమరాజున కెరిగించుట.

మయంతియనుగుయువన్య, లంతఃపురంబునకరిగి యాభీమ, ధరణీశ్వరునిగాంచి
దమయంతి తెరగు, పరువడి వక విన్నపము నిట్లు చేసి, వోరాజదేవేంద్ర మోద
యాసాంద్ర, వారకనీపుత్రి వార్తలాలింపు, యొకనాడు దమయంతి యుద్యాన
వాటి, సఖులతో క్రీడలుసలుపుచునుండ, వనమునకెందుండి వచ్చెనో యనగ,
మనురక్తితోడ రాజహంసలెన్నెన్ని, చనుదెంచి దమయంతి సంగడి వ్రాలె, త
నుగట్టుటకు త్రాళ్లుతాదెచ్చుకొన్న, యనువునకోక యొంచ నందందబట్టి, కొని
పోవునంత నీకూతురు జూచి, పలుమారు మానవభాష నమ్మించ, నలునిరూప
ము తద్గుణములు సంపత్తి, యాలఘుతనసమంబులను వర్ణించి, వలపుబుట్టింప
భావజుడు కోపించి, విరహంబు బుట్టించి వేవేగబోయె, తరుణి యంతటనుండి ధ
రణీశ నలుని, తలచిచింతించు మోదంబునదలచు, పలుమారు దిగులొందు పరి
తాపమొందు, మముజూచి జీరునమ్మదనునిదూరు, కమలారిదిట్టుతక్కకమ
మ్మగొట్టు, హాయనిమతిదూలునవనిపై వ్రాలు, పాయకమూర్ఛిల్లుపడి నేల
బొర్లు, మనుజేశ యిటువంటి మదనతాపంబు, కనివినియెరుగ మెక్కడనైన మే
ము, మదబాణవేదనమానునో యంచు, సరసత జేసిన శైత్యోపచార, మంత
యింతని జెప్పనలవియెగాదు, వింతలు సుమ్మని వివరింతుమన్న, యిగురుపానుపు
మీద యింతిని జేర్చి, చిగురాకులన్నియు జెచ్చెరగమలె, తలచితామరపూలత
ల్పంబునందు, పొలతుకనుంచిన పొగలుగా నెగసె, చల్లనినీటిలో సఖియనుంచిన
న్న, కల్లుగాదిది వెచ్చగానయ్యె ఫలము, ముత్తెపుసరములు ముదితకునిడినకొత్త

నీలములా మెఱుఁగుమాత్రపహిన్నా। చన్దనంబలదినజలజాక్షి మేనకన్దియాతఁణ
మునకస్తూరియయ్యె। పన్నీగుకడవలపట్టితెప్పించి। వెన్నునఁబోసిన వెలదిశోభిం
చు।మా చేతగాదిఁక మగువఁబోషింప। నా చెలిబ్రతుకనీడామన్మథుఁడు।నెలనా
గసంగతినికఁదాచనేల।నలనొప్పపుత్రిగావలసియుండినను। నలునిరప్పింపుమా
నలుఁడురాకున్న। జలజాక్షి బ్రతుకదు సత్యమీమాట। ఇన్నినాళ్ళు తెరగేర్పడ
మీకు। విన్నపంబొనరింప వెరచియుండితిమి। జాగుసేయఁగనింకఁజనదు భూనా
థ। వేగమె నలమహీవిభునిరప్పింపు। మన ప్రభుతలయూఁచియతివలజూచి। మ
నమునఁజింతించి మనుజేశుఁడనియె। నాదుబిడ్డకన్న యట్టిమానవుని। పాడిత
పంబులుపౌరుషంబులును। చెడునంచు పెద్దలుచెప్పినమాట।తడయక నిజమా
యెదమయంతివలన।నేమిసేయుదునింక నిటమీఁద నేను నామహీపతిబిల్వనంపు
టయెట్లునారాజు ల్వాగనలవియె నాకు।నారాజుబిల్చిననతఁడేలవచ్చు।నలుఁడన
గానుర్వినారాయణుఁడు।నలునిరప్పించగానాచేతగాదె।బలవంతమూననియ్యి
జాటిగాదిలను।బలవంతురప్పింపఁబలిమియు లేదు। నామహీశునిగోరనాతికిద
గునె। బలువిడిసురమహీపాలులు లేరె। యనితలపోయుచునాత్మజకడకు। చ
నుదెంచి సుకేఁగున్న చన్దంబుజూచి। వెరగందియప్పుడు వేవేగవచ్చి। వెరవొప్ప
సంధ్యాదివిధులెల్లఁదీర్చి కొలువుచావడికి గ్రక్కున నేగుదెంచి।నలువైనసింహా
సనముగూర్చుండి హితులగాయకపురోహితమంత్రివరుల।నతివేగరప్పించియ
ప్పుడిట్లనియె । మనదమయంతికోమలులతోఁగూడి । యొనరంగ నొక్కనా
డుద్యానవనిని। వేడుకలలరంగ విహరింపుచుండ। వాడకు రాయంచలరుదెంచి

భీమరాజు దమయంతిస్వయంవరంబునకై యాలోచించుట.

నలుని। వరరూపలావణ్యవైభవస్ఫురణ। వరుసతో వర్ణింపఁబదరుచుబోయె।
నంతటనుండి తొయ్యలిదమయంతి। చింతించినలునిపైచిత్తంబు జేర్చి। కంతుని
చేజాలగాసిల్లెననుచు। నింతులు జెప్పిరియింకేమియనిన। వినిసభవారెల్ల విభు
డువీక్షించి జననాథయిందుకుసంతాపమంది।నేలమే మొక కార్యమెరిగింతునిపు
డు।భూలోకమునఁనున్నభూనాయకుండు। వనరుహాక్షికి స్వయంవరమహో
త్సవము। యనిచెప్పిపంపినసప్పుడానలుఁడు। చనుదెంచుసకలరాజన్యులువత్తు
రనవినియిది కారణమౌనని చెప్పి। రమమునచారులరప్పించిజూచి। ప్రియము
రెట్టింపంగ భీముడిట్లనియె।నరుదారనిషధేశుఁడాదిగాఁగల్గు। ధరణీశ్వరులనెల్లత
ప్పకగాంచి। కలకంఠిదమయంతికన్యకకిపుడు।వలనుమీరినస్వయంవరమనిచె

ప్పి। చనుదెంచెపొండనిజనపతిబలుక। నని వారలప్పుడు వేవేగ జనిరి। భూవిభుండప్పుడా పురవరంబెల్ల। ప్రేమమీరనలంకరింపుడటంచు। తలవరులకు జెప్పితగచాటుబలికె। తలవరలప్పుడాధరణీశుమీఁద। నానబెట్టుచుపురంబటువీధివీధి। పురనుకతమ్మటంబులు వేసికొనుచు। సరగునహోయనిచాటించిరంత। పురము వారెల్లనప్పుడు వాడవాడ। కమ్మనికస్తూరికలిపిపన్నీట। గమ్మనివాసింపకలయంగ

## దమయంతిస్వయంవరంబునకై పురంబలంకరించుట.

జల్లి। పచ్చతోరణములు బాగుగాగట్టి। తెచ్చిబంగరుప్రాత మేల్కట్టుగట్టి। కదళీరా స్తంభముల్ కడు వేడ్క నిలిపి। ముదమొప్ప ముత్యాలముగ్గులు బెట్టి। చెంగావిపెక్కాముల్ చేర్చియింటింట। సంగతిగెందమ్మిసరములువిడిచి। కుంకుమపన్నీటగోడలబూసి। పొంకంబుగా చిత్రపుత్రికల్ వ్రాసి। చెలువమందినయట్లుచిత్రవైఖరులు। గలుగనప్పురముశృంగారింపుచుండి। నంతలోపలచారులానలాధీశుని। సంతసంబునగాంచిసద్భక్తిమ్రొక్కి। ధరణీశతేశవిదర్భావనీశు వరనందనకుస్వయంవరమహోత్సవము। గావునదమయంతికల్యాణమునకు। వేవేగ దేవరవేంచేయవలయు। నని చెప్పిసకలలోకాధీశ్వరులకు। వినుపించియా భీమవిభునికరిగిరి। రంతటనిషధేశుడానందమంది। కుంతలబర్బరకోసలపాండ్య

## నలుడుస్వయంవరమునకై విదర్భపురికరుగుట

మాళవద్రవిళాంధ్రమగధకాశ్మీర। కళింగకాంభోజకర్ణాటలలాట। వరహాటకరహాటమత్స్యసౌరాష్ట్ర। కురుసింధుఘూర్జరకురుకురసౌవీర। గౌళనేపాళబంగాళపాంచాల। చోళాదినాథులుసుముఖులైకొలువ। నాదిత్యరథసమంబైన తేరెక్కి। భూదేవసచివాప్తబుధులతోఁగూడి। బహుగజగయురథభటచతురంగ। సహితుఁడై యెదుట వేశ్యాతాళమూన। సంగీతవాట్యఘోషంబులు జెలగ। మంగళవాద్యసమర్థంబుగలిగి। మహితాతపత్రచామరములుమించు। రహిపచ్చవన్నెపావడలుంజల్ల। కంచుకోష్ణీషాలబూనగలుసాగసరకులంచితపటకావాళిములునమర। భేరీమృదంగగంభీరవాద్యములు। బోరుకల్లడమై సభూనభోంతరములు। నలుడీగతివిదర్భనగరమార్గమున। పొలుపొందిమెల్లనబోవుచుండె। నపుడుపావనశ్రీపతిభక్తియుతుడు। సురమునీశ్వరుడు భా

## నారదుండు దమయంతిస్వయంవరంబును నింద్రునికెరిగించుట.

సురగుణోజ్వలుండు। తలనిండ కెంజడవలెముగాజుట్టి। నలువందుకృష్ణాజినమును బెట్టి। రహిద్వాదశోర్ధ్వ(పుండ్ర)ములను బెట్టి। మహితముగాపుననేర్చి

సవేగ-యోగవాగము లెక్కి-యొగి నారదుండు-బాగుగా శ్రీపతి బాడి సొక్కు-
చును-ధరణీశ్రద్రిప్పాచు దమయంతినంద - మెరిగి యావృత్తాంతమెల్ల సవేగ।
పురుహూతునకు జెప్ప భోరున దివికి-నరిగి మానిల్లంతట జూచి-కిన్నరగంధర్వఖే
చరగరుడ-కిన్నరదేవదిక్పాలకుల్గొలువ-నలరిననృత్యంబు రంభాద్యప్సరసలు
సలుపబంగారుగద్దియ చయ్యన డిగ్గి-యెదురేగి భక్తి దేవేంద్రుండు మౌని-పద
ముల కెరగి శుభప్రాప్తి కెల్ల-పద్యంబులొసగి కాంభసిడిపీఠమున-విద్యానిధిని
యోగివిభు నంచు భక్తి-పూజించి చేతులు మొగిడిచి యింద్రు-నా జటీంద్రుడు
చూచి యపుడిట్టులని యె-[illegible]రనాథ వినుమొక శుభవార్త నిపుడు-ధరలోననా
కవి చిత్రంబును బుట్టె-వినుము భీమభూపాలండభేద్యవిక్రముఁడు-సోమార్కవి
భుఁడు భాసురగుణోజ్జ్వలుడు-ఇల విదర్భపురంబునేలెడు రాజు-వలనొప్ప నతనికి
వరపుత్రికైన-యలివేణి దమయంతి యనుకన్యగలదు-తలపుల దాని సౌందర్య
సంపదలు-వనజాసనునికైన వర్ణింపరాదు-వినుము నేచూడని వెలదులు లేరు-
చూచితి పార్వతి చూచితి లక్ష్మి-చూచితి భారతి చూచితి రతిని।చూచితి తారను
చూచితి సచిని-చూచితి మేనక చూచితి రంభ-నొక్క-డకలివిని యెరుగ మెన్నం
ము-నక్క-మలాక్షి నలావనీశ్వరుని-మదిలోన గోరి మన్మథబాణవేధ-బెదరి క్ర
ృశింపగా భీమభూవిభుడు-నలుని దెచ్చుటకు భూనాథుల కెల్ల-నలదమయంతి స్వ
యంవరంబునకు-రండని భటులచే [illegible] పృథ-మండలాధీశ్వరు లాద్యమానవే
శ్వరులు-హయకుంజరస్యందన యోధులుగను-రయమున నా విదర్భపురంబు
జేర-బోవుచున్నారదె భూలోకవార్త-దేవేంద్ర సికును నేదెలుపవచ్చితి-తగు
నీకు దమయంతి తగదన్యులకును-నగభేదియని చెప్పి నారదుండరిగె-సురనాథు
డధిక తేజోమూర్తులైన।వరుణాకృశానుల [illegible] పనుల బుప్పూరను।గనుగొని సంతో
షకలితుడై పలికె-మనమునలుగ్వురమునెమ్మది సార్థ్యమునకు-బోయి యందు వి
దర్భపురమున్ గాంచి-యా ఇంతిగనుగొందమని పల్కి-నారు-బరతెంచి [illegible] లు
పురపట్టణోపరిని-పురలక్ష్మివైభవంబును చూచుచుండ-దంపతుల్గొలువ సేన
లు చుట్టి నిల్వ-నరుదెంచి పురవీధి సరుగుచున్నట్టి-నలుని గన్గొని తన్నగరభామి

—*( విదర్భపురజనంబులు నలుని వర్ణించుట )*—

నులు-పాలుపొంద ప్రాకారముల గోపురములు-తలవాకిళులున్నంత వృద్ధి
యలనిచి। యున్నలధారుని విభుని బూచి-కామ రందనందన గుంపులు గూడి।ప
మదలొండొరులతో భాషించిరిట్లు-చూడరే యారాజసొంపు [illegible]-వే

పుకలమ్యోడుచూడచూడతని-యాతనిచక్కదనముయవ్వనము।దనరారియి
ట్టియందంబుచందంబు- పొలుపొందునేయెందుభువియందునివియు- కలవె
లోకములనెక్కడవిచారింప- కన్నుడో శ్రీరమాకాంతుడోయనగ- జయంతు
డోగాకమోహనవసంతుండో-ఈమనుజేశ్వరుండీనుడో చంద్రుండో- యీ
మహామహుడుదేవేంద్రుండో హరుడో-ననవిల్లుపుష్పబాణములుండెనేని-మ
నసిజుడనివీనిమదిజెప్పవచ్చు- కరములశంఖచక్రములుండెనేని- పరగనీతనిర
మాపతియనవచ్చు-మూడుకన్నులుముఖంబునకలైనేని- వేడుకపార్వనివిభు
డనవచ్చు- వేయికన్నులమేనవిలసిల్లెనేని।యీయమరాధిపుడనిచెప్పవచ్చు-
ననివితర్కించిభీమావనీవిభుడు-వినుతింపదగినట్టివిడిదిజూపుటయు।నలుడందు
విడిసియందరనప్పుడన్ని-సెలవులవిడియించినిష్టనన్నంత-హరిహయాదులత
మయకదంబులన్ని- లెరుగకుండగనొక్కయిక్కనుదాచి- పొలుపొందసిట
రూపములతోడవచ్చి- నలరాజునెదుటక్రన్ననవచ్చినిలువ- కనుగొనినలమ
హీకాంతుండుదివిజు- లనుచుడిగ్గునలేచియతిభక్తితోడ- నెదురుగాజనుదెం
చియులసాగిల్రమొక్కి- మోదమందివివిధమ్ముల్రబస్తుతించి- యనురక్తిగొనివ
చ్చిహేమాసనముల-నునిచిచేతుమోడ్చియురుభక్తిబలికె- ననుతేజశిఖము
నావులార- కొమరొప్పనాల్గుదిక్కులయందు - దలచికరమర్థిసకలలోకముల
రక్షించు-పరమాత్ములారనాభాగ్యమహిమ- చనుదెంచిగారుమీసందర్శ
మునసే-పుణ్యుండనైతిగాభూలోకమునను - కరుణమీరిటకునిక్కమువచ్చి
నట్టి- తెరగెరిగింపుడు తెలియంగనేడు - ఘనమూర్తులారమీకార్యమునైన
ను-యనుకూలమొనరింతుఘనుపాసవుడు-వినినలోకేశ్వరునివీక్షించిపలికె-
జననాథచంద్రనీసత్యశీలంబు-పటుగతిసకలభూభాగంబునిండె-నటుగానవినుము

—( దేవేంద్రాదులకై నలుండుదమయంతియంతఃపురంబునకేగుట )—

జూడభీమావబట్టి-చనుదెంచిపోయినీచందమంతయును-కనుగొనిసంతోష
కరమయ్యేమాకు- తరళాయతాక్షి కిదమయంతికన్య- కరయస్వయంవరమని
నేము-సలుపుగమనుదెచ్చితా ఇంతిగోరి-నీనాస్తకులజమానాలదగ్గరకు- జ
నవేడ్క నిమదిసరిపోవురీతి-ననుకూలపరచిచయ్యనవమ్ము పొమ్ము-జనువిధం
బెట్లు బాలిబొందకుము- మనుజేశనికన్నదరిజేరమాకు- వసుధేశలెందరోవ
చ్చియున్నారు-పొసగనిఖరసేవుబంటులేసేవారి- మాకార్యమంతయుమను
లాధీశ నీకార్యమనిచూడనేరుపుగాన-నీకుజెప్పితినినిమదేశసీవు- పోకు [illegible]

విపులమౌబుద్ధియొకలుగు-నావుణ్యచరిత సర్వోర్వీభువిభుఁడు-దేవేంద్రుఁగను
గొనివిధీశుఁడై పలికె|నది యేమి దేవ నీకిటువంటి మాట| యాదయ నీవ లెన్నిట్టిలోడ
గదగునే-యందంబు భూనాథులరయుచు వచ్చు|నందాక నేనును జనుదెంచి మా
డ-నాకంజలోచన ననుకూలపరచు-నాకు జెప్పగ నీకు న్యాయమా దేవ- యా
రవెలుకనుముదితచుంచి-జెందిన వేడ్క-భాషించియున్నా నె- బాలుపొంద
యునబోయి వచ్చితి-వెలదియు నా మాట విని నెవలదనక- పన్నుగా నిట
పతులకు పోవ-కన్నడివిన్న దికలదెపిరలను| పాయక నిటువంటి పనులు వా
సేయుటగా దెపి సేవగావింతు నింతయే గాని - యా యింతి నిపుడు సంతసంబున
బుద్ధిజాలదుగూర్ప-చేరి యీ పనులు నేర్చిన వారి బిలిచి- యా రమణీమణి పత్రిం
పుచుండ-డవుడు పురుహూతుఁ డా రాజు జూచి|ఘనకృపారస మొల్కగా నిట్టు
లనియె-నినకులాధీశుని నే కార్యమైన-ననుకూలపరచెద నంటి విప్రుఁడు|పనిబడి
మే మొక్క-పనికి బొమ్మనిన-వినయము మ్రొక్కులుచు వెలదుల కడకు- పోక యిప్ప
డే బొంకితివనిన-పోలించి యే మున బోయెద మింక- పరువడి సత్యసంపన్నుండవ
నుచు-సురులు జెప్పగ నిన్ను జూడవచ్చితిమి - కరమొప్ప దబ్బఁ గాడపటంచు-
నెరిగితె మెంమేలైతె వచ్చెదము-జగతి యిక్ష్వాకువంశజులెల్ల మున్ను- బాగడె
నకీర్తులబ్బా దిరి తొల్లి!-తొలి యిట్టివారి వంశమునందు నీవు- పుట్టిద బ్బరలకు
పుట్టిల్లవైతివి- మేలు చేసిన నెన్నటికినైన-మా మనంబుల నిన్ను మరువంగ లేము
నలరాజు సురరాజునకు బెండ్లి జేసె-నలి వేణి దమయంతి ననిర మానాథు- డెరిగి
తేని నుమెచ్చు పెద్దకాదె- ధరణీశ లేశ యాదను జోరితి మైన- మా కార్యమనిన
తామసమింత లేక-జేకొని కరుణతో జేసి రక్షించు- ధరణీశ మామీద దయ లేదు
మీకు- నరిగెద వింధుల కేమి గానిమ్ము- చని యెద మిక నని చర్చించి పలుక- విని
చాలమదిలోన వెలవెలబారి-కరములు మురిళించి ఘనభక్తి మీర-ధరణీశుఁ డా
పురందరున కిట్లనియె- సురనీ బంటునై యుండెడువాడ|నసహాత్మ నాపీద నత్యం
తకరుణా-గలిగి వచ్చితి టుగాన నే నిపుడు- నెలమిని నా దమయంతి దగ్గరకు- నర
యు నేదే గతి నరుగుదు ననుమ- కరుణాసముద్రయీగతి ని బల్కితివి - యకట
యా దమయంతి యంతఃపురంబునకు-పోతు టెగ్గైన నుపొందరాదు- గావున
నిప్పుడి కార్యమెరీతి-కావింతు నీ మాట కపటము గాదు-తడయక దానియంతఃపు
రంబునకు-నుడువను పాయంబు నాకెరుగింపు-డనవిని శైలారి యాత్మమోదిం
చి- మనుజేశ్వరుని జూచి మగియు నిట్లనియె - దమయంతి కన్యకు దాని యంతు

లకు- క్రమమునసిరూపుగనుపించుగాక- నితరులకెవ్వరికెరుగంగరాక- పతి
తోనుభాషించిచను దెంచుదనుక-ననియొప్పవరమిచ్చియరుగుమటంచు- పని
చినవారికిభక్తితో మ్రొక్కి-చనిచనియాభీమజనాయకుండు- పెనుపొంద
రిహితులతో పేరోలగమున। నాయెడగూర్చుండెయాలోచనంబు। సేయంగనొక
కొంత సేపుండిచూచి-యరుదైనకనకహర్మ్యంబులుగడచి-మెరసెడిబంగారు
మేడలుగడచి। సరసతచిత్తరులచవికెలుగడచి-వరునతోపగడపువాకిళ్లుగడచి
యక్కడక్కడనిల్చియంతఃపురంబు-నక్కజంబుగదాటయాదమయంతి। నలు
నిరూపంబులనలుపురుదాల్చి- కొలువునసలుచెంతగూర్చుండిరంత- భీమునం
దనుదాదు పిలిచిమీరెంక-కామినిదమయంతికన్యకామణికి- కడువేడ్కమీర
శృంగారిన్చివరము-లనుగంగదేవాలయంబునకరిగి- శ్రీరమాపతిపూజింపంగ
జేసి- కోరిచయ్యనదోడుకొనుచురావలయు- ననుటయుదమయంతి కాయిం
దుముఖులు-జనితేటపన్నీటజలకంబులార్చి - మెరుపడిజిలుగుతో మెయిదడి
యొత్తి-నుసులార్చివింతగాకొప్పుగీలించి- వరచంద్రకావిపావడమీదమించి-
వలుసన్నపుచల్వలువబాగొప్పగట్టి - గుబ్బలమీదకనకంబుపూల - పట్టు
కంచుకమును బాగుగాదొడిగి-తీరుగామృగనాభితిలకంబుదీర్చి కస్తూరిజవ్వా
దితో గూర్చినమంచి- హరిచందనముమేననందంబబూసి- విదితముల్ గొప్ప
వింతగాదురిమి- పటుసూర్యచంద్రులపాపటబొట్టు- నిటలంబుపైబ్రాలినిలిపి
కర్ణముల- కరమొప్పుబంగారుకమ్మలుబెట్టి- కరములవజ్రాలకడియముల్ బె
ట్టి-నీలంబుముంగరసీటుగాబెట్టి-లాలితంబుగనుబిళ్ళలదూలమర్చి- కరముల
ముద్దుటుంగరములుబెట్టి - మెరయహారంబులుమెడనిండనుంచి- తెలిదంమి
రేకులదెగడెడుముద్దు-కలికికన్నులమంచికాటుకబెట్టి। ఘనతరనవరత్నకాం
తులచేత- ద[illegible]నజిగినవంగిదండలుబెట్టి - పల్లేరుపువ్వులపసిడితీగెయును-
మొల్లమిగాజులుముంగారుమురుగులు- తిలకంబుపసిడిపాందియలాదిగాగ-
నలభూషణంబులుకన్యకామణికి- ధరియించివేడ్క-శ్రీధరుమందిరమున- కరు
దందదోడ్కొ-నిరుడిగిననింతి- కరములుముకుళించికన్యాలలామ- పరమా
త్ముడైనశ్రీపతినిదర్శించి-భయభక్తిమీరనేర్పునబ్రస్తుతి చె- జయభక్తమం
దారజయ[illegible]హారా- జయనిత్యకల్యాణజయజగత్త్రాణ- జయపద్మద
ళనేత్రజయనీలగాత్ర-జయకరుణాపాంగజయకీర్తిసాంగ-జయపాపసంహార
జయశుభాకార-జయబాహుబలధుర్యజయదేవవర్య-జయభోగసుత్రామజ

యోగుణోద్ధామ- జయరమాహృదయేశ జయచిత్ప్రకాశ- జయపరమానంద
జయపుణ్యబృంద- యనినిన్ను గొనియాడ నలవిశేషనాకు- ననుకరుణింపుము
నాకాధిపతులు- నలుగురు చనుదెంచి నను గేలిసేయ- దలచియున్నారు నాధ వు
నిగావలెను- జేసి రక్షింపుము శ్రీనాధ యనుచు। భాసురమతితోడ బ్రస్తుతింపుచు
ను- జనుదెంచె దమయంతి సఖులతో గూడి- తన తండ్రి కడకు నానవనీశ్వరుండు-
పరువైన పచ్చని పల్లకిలోన- వరపుత్రి నునిచి వేవసుధామరులను- గనుగొని సిం
దభూకాంతుల నెల్ల- వినుత వాక్యంబు వేర్వేర జూపు- డని పుత్రిగను గొని యు
మ్మనియమ్మ- యనురక్తి రాజులనందరి జూచి- మనమున దలచిన మనుజేశు
కంఠ- మున పుష్పమాలిక నుంచు మనవైపు- మని చెప్పి ధరణీశుండంత నైదువల-
నను పమ్మతి గూర్చియు వల నెల్ల- హెచ్చరికలు జెప్పియే తేరబనిచి- యచ్చుగా
సకలసైన్యంబులు గొలువ- తనకుమారుని నొక్క తావున నునిచి- యొకరంగవ
దిలునై యుండు డటంచు- బలములన లుగడ బలు విడి నునిచి- యల రెడు సకలా
యుధాన్వితుడనుచు- బలియుడై తానుండె పార్థివేశ్వరుడు- నలివేణి దమయం
తి నవుడు దోడ్కొనుచు- చెలికత్తెలిరుగడ చేబూని రాగ। వలనొప్ప నా రాజవరు
ల వేర్వేర- నరయుచు వసుదేవుడను విప్రవరుడు- సురుచిరమతితోడ నూపంగ
దోడనే- కలకంఠి యీతడు గౌళభూనాధు- డలివేణి యితడు మహారాష్ట్ర విభు
డు- లలన యీఘనుడు [illegible] శవమహీశ్వరుడు- నెలత యీనరపతి నేపాళ విభుడు
వెలదియా రాజు ద్రావిడ దేశభర్త- కొమ్మ యీనాథుండు కురుధాత్రీశు- డ
మ్మ యీరాజేంద్రుడంగ భూవరుడు- సుదతి యీతండు మత్స్య వల్లభుడు-
సుదతి యీనృపమౌళి చోళదేశేశు- డెలనాగ కురుధరాధీశుడీ నృపతి- మెలత
యీతండు కాశ్మీర రాజన్యు- డలరుబోడి తనుయుగ భూవిభుడు- చెలియ యీ
ధీరుండు వింధ్య భూనాధు- డనియిట్లు రాజులనందర జూపి- వనితతో నిషధభూ
వరు జేరబోయి- నలరాజు దగ్గర నలువురు మారంగ- నలునిరూపంబున నలువురుం
డగను- పరికించి మూవ్రియా భూసురుడపుడు- నరుదెంచి యేమియు మనమున తూర
కుండె- నది జూచి దమయంతి యతివెల జూచి- యిది దేవతుల మాయ యిందు
కేమందు- నేపురుని షధేశుండెందై నగలరే- యీవట్టి వేషంబు లేలవీరలకు- న
క్కటా నేనొల్లననిపల్కుచుండ- తక్కక నిటు నేయుతగునె వీరలకు- తమవంటి
వారికిత గుననేమెను- తమ కులాంగనల నెంతటి మాపు దాన- కరుణ యింత
యు లేక కటకటా వీరు- సరసత నామీద జనపోరదగునే। యనుచు పల్లకి డిగ్గి యమ

రేశ్వరులకు-మునుకొని చెయ్యెత్తి మ్రొక్కి-యిట్లనియె - నిందేలకన్యకి
టువంటిపతులు-కొదుకక నేయమీకూతురుగా నె- నైజరూపుల దాల్చినర
లందరెఱుగ- రాజిల్ల సనుకృపారసమువ్పొంగాంచి- నాకాధిపతులారనలునికి
నన్ను-చేకూర్చి పెండ్లిగావించియా వేళ- కన్నులారగజూచికరుణతో నలుని
నన్నుదీవించిమన్నన జేసిమీరు- వేంచేయురయ్య నావెరపెల్లమాన్పి- యం
చు వేడిన మెచ్చియతిదయామతిని- ప్రముదితచిత్తులై బలభేదివహ్ని - జము
డునువరుణుడుసత్వరంబునను - తమతమరూపముల్ తప్పకదాల్చి - యు
మరంగగనుపడిరందరికప్డు - డాలోననలుని నొయ్యనచేరిపుష్ప - మాలిక
ధరియించె మగువకంఠమున - దివినుండిభూషించె దేవదుందుభులు - భువి
మీదగురిసెపువ్వులవాన - పాడిరిగంధర్వపతులుమోద  న- నాడిరియెను
రరంభాదికామినులు - నిర్వృతివాయుకుబేరనీశగళాది - హరునిదధీశులునాక
లామహుల్లివిసి - వానవానలయమవరుణులు భువిని - వాసికెక్కినరా నీవా
ధుభాగడి - రలఘునద్భక్తిభీమావనీశ్వరుడు - నలునికిత్తెంచెనున్నతిమీ
రనిపుడు - వెలయంగదేశాదివిభులెల్లవచ్చి - నలమహీశ్వరునకు నయము
తో మ్రొక్కి - పోలుపొందతమపురంబులకేగిరంత - నలరుచుదమయంతి
నాత్మలోనెన్ని - సాకేశునుడుదిక్పతులతో వచ్చి - చేకొనినలరాజశేఖ
రునపుడుగ్రుచ్చికౌగిట జేర్చికువలయాధీశ - యచ్చుగానీవుమాయెడప్రౌఢ
విలసు-చిరభక్తితో నీవుచేయుజన్మంబు- కరుణమీరంగ నేనుగైకొనుచుండి-
మనువకునామీదమక్కువలనుచు-ధరణీతలంబున నేతయుచిరకాల- మను
రక్తి పాలింపుమనియానతిచ్చె-ననలుడంతటవచ్చియవనీతలేశ!నీవునన్నెయ్యె
డ నెమ్మిప్రార్థింప-నావంకనిలిచెదననివరంబిచ్చె-జముడంత నేతెంచి జననాథ
చంద్ర-రమణనీవెంతధర్మము సేయుదలతు-నారూఢి నేసిత్తుననివరంబిచ్చె-నై
రథయటవచ్చినరలోకనాథ-నిరుపమశౌర్యంబునీకోర్కెకొలది- నరయంగ
నేసిత్తుననివరంబిచ్చె- వరుణుడంతటవచ్చివసుధాతలేంద్ర - చిరకాలమేలు
నీక్షితిననిపతికి-వాయుదేవుడువచ్చివసుధీశనీవు- నాయుతగతివేగమబ్బునం
చనియె - ధనపతివచ్చియోధరణీశనీవు - ధనమెంతగోరినదానిత్తుననియె-
మృడుడరుదెంచియోమేదినీనాథ- యడిగినమహినిత్తుననివరంబిచ్చె- నప్పు
డుముదమందియుంమహీశ్వరుడు - తప్పకవారికిదండముల్ బెట్టి- వినుతింప
వారలువినువీధికెగసి- జనిరివేగమునవిర్జరలోకమునకు- వల్లునికూతుచనట

జోడుకొనుచు। మెల్లనసప్పుడు మేదినీశ్వరుడు-శిరమైన పెండ్లిపందిల కేగుదెంచి
కర మొప్పునవరత్నఖచితమైనట్టి। బంగారుపీటలపై వధూవరుల। నంగనలటుని
ల్పి హారతులొసగ। నవనీసురాంగనలతి వేడ్కతోడ। ధవళముల్పాడంగ దండివా
ద్యములు। పటహధ్వనులు నభోభాగంబునిండ। తటుకున భేరీమృదంగగంభీర। ర
వమునధారాదరములు ఘూర్ణిల్ల। కవకూడి వందిమాగధులకీర్తింప। సంగతి
గానాగసరములు బాడ। సన్గీతవాద్యఘోషమ్ములు చెలంగ। బూరగల్పించుకొ
మ్ములుకాహళములు। భోరుకల్గుటకునంబుధులెల్ల నల్లవేత్తలై హాహామనం
త్యేల్పించి। భూసురోత్తములక్షతలొసగదీవింప। నెలమివారాంగనల్నృత్తము
ల్సలుప। చెలగి పుణ్యస్త్రీలు సేసలుజల్లి। పలుదెర గులనుశోభనములు బాడ।
చెలువొంద పెద్దలాశీర్వాదమొసగ। తరలాయతాక్షి నిదమయంతినపుడు। నిల
పతినలరాజునకుదారబోసె। హరుడు పార్వతియునుయమరినయట్లు। సరసిజా
క్షుడు రమాజలజాక్షియట్లు। సరసిజాసనుడు శారదయట్లు। నెరిశశాంకుడురో
హిణీదేవియట్లు। శ్రీతిదరాహితుడు శచీదేవియట్లు లతివిభారతియుచాయాదేవి
యట్లు। తిలకించిరట్ల పెండ్లిదినములుగడపి। పలనొప్పబెండ్లికివచ్చినవారి। భోజ
నంబులదృప్తిబొందించిమిగుల। రాజిల్లువహిమునంజికాంబరములు। దనరు
భూషణములదనిపిపిట్యాలిపి। ఘనలీలవందిమాగధకవిదుల్లకు తొడవులు
దొరలవస్త్రములునుసొసగి। తడయక బహురత్నతతులనొసంగి। వేడుకమీ
రనిర్విఘ్నమునపెండ్లి। పోడిమిజనులెల్ల పొలుపొందజేసి విరుమానామానని
ర్యాసంపత్తి। సుఖతరసుఖలీలనుండిరంతటను। గలకంఠినమయయతికన్యకామణి
కపరనొప్పమున్న స్వయంవరమును। వార్తవినిపిలిగినాపవనిభుడు వేగ। తన
లోనతులసంతాపమ్ము నొంది। యపుడు పెండ్యాడగానాత్మలోగోరి। విపరీతబు
ద్ధులవివరించుకొనుచు। తలవెంటుకలుపీడతత్తరింపుచును। జలజలమనిఘర్మ
జలబిందులరుల। బరువున నేతెంచి బలిసి దిక్పతులు। గరుడఖేచరయక్షగంధర్వ
సిద్ధ సరసవిద్యాధరచారణసాధ్యసురయక్షపన్నగుల్బట్టుచుకొలువ। కొలువు
న్నయిందునినిగొబ్బునగదసి। బలవైరిమాకొక్కపనిగలదదియువినుము చెప్పె
దధరావిభుపుత్రియొక్కతె। జలజాయతాక్షిభావజుమేటిదంతి। దమయంతియ
నియెడుతరళాక్షికలదు। క్రిమ మొప్ప దానికమవేడ్కతోడ। నరయస్వయంవ
రమునిపింటినేను। దరయుండు దానిసౌందర్యసంపదకు। సరిరారెరంభాదిసారకా
మినులు। తరముగాచక్కదనమువర్ణింప। సరగునజనియెదముసఖినివర్ణించి।

తిరిగి రావలయునే తెరగున నైన ♦ వనిత కెప్పుడు స్వయంవరము కోయనుచు। దివ
ము లెంచుక యేనుతిరుగుచున్నాను। నేడు మీధర్మాల నెరవేరగలిగె। వాడిచే
పెండ్లాడు వచ్చెదననుచు గడిగిదుశ్శకునము ల్గనుపింపనిటకు। నడచితినిటుగా
ననావివాహమున। కేకీచు బుట్టినోయెుకుగంగరాకు। నాకేమిపింఛోడనయ
ములకంగ। కరపర్ధిదమయంతికన్నెయనిటకు। పరిఋంచి తెత్తునో చ పవనాకు।
కరుణతో యొకయుపకారంబు సేయు ♦ మరసిసురేశ పీకదివిస్నవింతు-నందనవ
నములో సలినాక్షి గూడి। పొందకంది కేళిభోగింపవలయు। ననవృషుదేవేంద్రుడ
పుషుదిక్పతుల-కనుగొనినవ్వియాకలికిట్టులనియె- నేటికి మహికి బోయెదుతద్వి
ధాశు। తేట తెల్లంబుగా తెలిపెదనోయి- మహాదమయంతిస్వయంవరక్రియకు ♦
నాదినివిని ఈహుతాశనశమన- వరుణులగూడి నేనువసుధకుసగ్గి- గరితచిత్తం
బెన్ని గతులనోయరయు- మమ్మెల్లదండులిలుమారుగా నెన్ని- సమ్మతినలుపాం
లాసఖుగా వరించె- రావునవారలకడ జేసిమరల- దేవలోకమున కేతెంచితిమి
వు-పొలుపొందనట కేలపోయెదవనిన-కంగివితర్కించి కలిపురుషుండు-మొగ
మువజేవురుమురువునటింప-భుగభుగనిగుడెనిప్పులపొగలెగయు ♦ జొటజొటచె
మటలుసోనలై కురియు - చటచటమనగోళ్ళతడబడచూడ - కటకటాయని
యూముకిరదికన్నులను - తటతటనిప్పులుదొరగహాయనుచు- కాలాగ్నిరు
ద్రుడో కాలభైరవుడో- కాలసూర్యుడో ప్రళయకాలుడో యనగ- గర్జించిభీ
షణాకారుడై యపుడు- నిర్జరాళిలవణాకంగ నిలిచి ఇట్లనియె-నిన్నాశ్రయించి
నావలనాగ గోరి-యున్న నేనుండగ నూరక తాను ♦ నన్ను తానని వచ్చినలు డెం
తవాడు-కన్న నన్నాయి తిగ్గె గొనిపోవ-నా కేశ నివేగనా దొక్క-మాట ♦ నాకు
జెప్పక పోనన్యాయమానీరు పోయిన వారెల్ల పొలతి వరించి। ఈ యెడకే తెర వె
ట్లు వచ్చితిరి। నరులలో సురలమానము గోలుపుచ్చి। వరియింపవచ్చిన వాడా
నలుడు। నమరులు వచ్చిరి తానుభోక। దమయంతి వరియింప తానెంత
ఘనుడో। మంచిదందుల కేమియదిగాక గూడి। యెంచి తాకాపురం బెట్టు జే
సెడినో। చూచెదనపుడు సురరాజు బలికె। భూచక్రమెల్ల నేవునన విష్ణుచక్ర
మెలమిపని సేయునే లెడంబలియు ♦ డెలవా నిత్యమీ రేడులోకముల ♦ నాకూర్థి
నంతయు నాక్రమించినది। యీరాజ నరుని పైయలుగంగవలదు। మహిలోన
నలుడు సామాన్యుడు గాడు। మహితకులాగ్రణి మేదినీశ్వరుడు। సంతతశ్రీమూ
ర్తి సరసపతి ♦ [illegible] వంతుండునాచారవంతుండు ఘనుడు। వానిసత్యమెరింగి

వచ్చితినిటకు, నానరనాయకుఁడవనిలోపలను, నీకుసాధ్యుఁడుగాఁడునీకసాధ్యు
ఁడై, యోకలిరాజనీవూరకనింక, కోపంబువానిపైకూడదామాట, పాపంబువ
చ్చునీపనిసేయఁగూడ,దనవినిమరియురౌద్రాకారుఁడగుచు, ననిమిషపతితోడ
ననియెనాతండు,కనలియీరేడులోకములనాకన్న, ఘనుఁడెవ్వఁడున్నాఁడుకం
టివేనీవు, వెరగొప్పనాపేరువిన్నమాత్రమున, హరిహరబ్రహ్మాదులంతటివా
రు, వెరచిచుట్టమురాగవెరచియుండుదురు,గరుడఖేచరయక్షగంధర్వఖచర,వ
రులైననామాయవర్ణింపలేరు, సురనాథనానేర్పుజూచెదనింక,నలుఁడనియె
డియొకనరుఁడునావద్ద,నిలిచియుండునెచూడునీవుమెచ్చెదవు, దమయంతినా
చేతతాఁబడుపాటు, రమణియెవ్వతెబడురాజ్యంబులోన, నేనుగోరినయట్టినె
లతనువచ్చి, తానుగైకొనిపోవతానెంతఘనుఁడో, వానితోఁజలపారవానినే
బట్టి, పూనిజూదంబాడబుద్ధిపుట్టించి, మాయలుజేసియామహినెడబాసి,పా
యకపయినున్నబట్టబోజేసి, గారించియిలగోచిగానిగావించి, యారణ్యభూ
ములనలయంగజేసి, మానినినెడబాసి మనసునొప్పించి, దీనతనొందితెలివిద
ప్పించి, మారురూపముజేసిమహిమరపించి,గావించియునిత్యదుఃఖములనొం
దించి,కుండగోరికజేసికువలయేశునకు, వండిపెట్టగజేసివానినీరీతిచీకాకుబడ
మాయచేయుకనున్న, నాకేళివినుము నేనలునికిబంటు। నాథుఁడవర్ణింపగానం
దాకకలిని,గాదనియీరీతిగామహాప్రతిజ్ఞ, బలికియింద్రునితోడఁబరువునఁనప్పు
డు,నిల్చినచోటనునిలువంగలేక, ప్రాకటంబుగవిదర్భపురంబుజొచ్చి, యా
కోపమునవిమథాధీశుడైన, నలరాజచంద్రునినయముగాజూచి, కలియెంత
మాత్రముగదియుచోవెరచి, యాతనిసత్యంబునాతనిశౌచ, మాతనియాకా
రమంతయుదెలిసి, కుతలాధిపునిజేరగూడదటంచు,నతడెందుదిరిగినదివెల్ల
గనుచు, నక్కడక్కడగూడియుండందదిరిగి, కక్కసపడుచు కోపముజెందు
చుండె,నంతఃకొన్నినాళ్ళరిగిననలుఁడు,సంతసంబునభీమజనాథుగాంచి,యు
కమాపురంబునకేగన్గవలయు।నకలంకనిపుత్రినంపించుమనిన।నటువలెజేయు
దుమవనీశతిలక, కుటిలకుంతలితోడుకొనిపోవనిచట,నుండుమన్నసుమీరలుం

—(నలుఁడుదమయంతితోడస్వర్గంబునకేగుట.)—

డరేయనుచు, వెంబడియుబలికిభూవిభుఁడుకుమారి, నామెడబొడగాంచియు
తనికిట్లనియె, హోయమ్మనీమగడోగిపురంబునకు!బోవలెననినీవుబోయిరమ్ము
నిన, వావిరిదమయంతి వగచుచునప్పుడు, తల్లివద్దికివచ్చి తనమానసమున,

తల్లడింపుచు బల్కె తండ్రి నన్నిపుడు, తనయల్లుడూరికి తర్లి పోదలంచి, నను వెంట
నంపుచున్నాఁడరిగాన, నాతని వెనువెంట నంపుదు ననుచు, నాతోడ నెరిగించి
నాఁడె యోయమ్మ, యనవుడు తనపుత్రి నతివ కౌగిటను, ననిచి పోయని యేడ్చి
యోయమ్మ యనుచు, నను బాసి పోయెద వాముద్దులాడి, యనితల్లి పుత్రియు
నందంద యేడ్వ. దమయంతి దాదులు దాసజనంబు, గుంపులు గూడి యందఱు
గోయని యేడ్వ, చనుదెంచి భీమభూజననాయకుండు, తనపుత్రి నూరార్చి తన
యింతి దెలిపి, దాదుల వారించి దమయంతి జూచి, యాదరంబున బల్కె నదియే
మితల్లి, యేల యేడ్చెదనీవు కేమిటకొదువ, లాలితసౌందర్యలక్షణావ్వయుఁడు,
యిల యేడుదీవుల నేలెడురాజు, నలరాజచంద్రుండు నరలోకనాథు। డట్టిభూ
నాయకుండతివ రోసన్ను, నెట్టన జేపట్టెనీ కేలవగవ। వరలోకనుతుఁడయిన నలచ
క్రవర్తి। యరయ నిన్నుంచి నాకల్లుఁడై యొప్పె। పెక్కుకాలము నాకు బిడ్డలు లే
క। మక్కువ నిను గాంచి మాన్యుండనైతి, సురనాయకుల గూడ చూడంగ గలిగె।
కరమొప్పు చిరకీర్తి గలుగుట జేసి। యిందీవరాక్షి నీ యిందును నందు। పొందుగా
వచ్చుచు బోవుచునుండు। మమ్మరోసి యన్న నంపుదు వెంట। సమ్మదంబున బోఇ
చనుదెమ్ము నీవు। మనమున దుఃఖంబు మానుమో యమ్మ। నినుబాడ కన్నాళ్ళుని
ర్వహించుదునే। పెనుపొంద వెంట నే పిలువనంపింతు। పసిబుజ్జగించుచు నాదర
బుద్ధి। తనపుత్రి నలునకు సకుతగ నొప్పగించి। తనయకు తరణంబు లనియంగ నిచ్చి।
బోయిరమ్మని పల్కి పొలతి శోకమున। బాయక తమతల్లి పదములు వ్రాల। గ్రుచ్చి
కౌగిట జేర్చి కోర్కె దీవించి। మచ్చిక గురుభక్తి మానకెల్లపుడు। సతిలోన స్త్రీ
లకు మంగళంబైన। సతతపతివ్రతాచర్యలకడకు। ప్రతిమాట నడచుచు పరిచర్య
జేసి పతిని శ్రీపతిగాగ భావింపవమ్మ। వసుమతి మనపరివారలలోన। పొసగగ సత్కీ
ర్తులు బుట్టింపవమ్మ। మదిరాక్షి చెలువొంద మనవంశమునకు। వదలక మరి యొ
కవన్నె దేవమ్మ। కుసుమకోమలి బుధకోటికీర్తింప। వసుమతీశుడు మెచ్చవ
ర్తింపవమ్మ। సరసత నాథుండు చనువిచ్చునపుడు। వరిమురి పలుమాటలాడకు
మమ్మ। యని ముద్దుబెట్టి చయ్యన బుద్ధిచెప్పి। మునుకొల మోమున మోమును
చేర్చి। నాయమ్మ నాకూన నాముద్దుచిలుక। పోయిరమ్మనవుడు పోయి తండ్రికి। మ్రొ
క్కిన దీవించి యొగి బుద్ధిచెప్పి। గ్రక్కున నవరత్నఖచితమౌ శిబిక। లోలోన నీరేజ
లోచన నుప। నాలోన నరుడొక్క యరదంబునెక్కి। మామను వీడ్కొని మగు
వయు బాసు। ప్రేమతో దమనుండు వెంబడిరాగ। కరిరథభటఘోటకంబులు

గొలువ- తరుపముప్పదిరెండువాద్యముల్ మ్రోయ- వారకభటులుబెళయివా
రంబుసేయ। వారకామినులిరువంకలనాడ। చేరిపుణ్యాంగనల్ సేసలుజల్లధారు
ణీసురులుబాంధవులుకీర్తింప, దివినుండిదేవతల్ దీవించుచుండ,నవనిపుష్పాల
వానలందటుగురియ। మనుజేంద్రుడిటువంటిమహిమశోభిల్ల, జనుదేరనప్పుడు
సంభ్రమంబెసగ, పురమువారెల్లనుప్పొంగుచుగూడి। వధుసతోనెనరుగాన
చ్చివీక్షింప।పరివారజనముల్భక్తిసేవింప।నరపతితనపట్టణముప్రవేశింప।పుర
సతిజనములప్పుడతివేడ్కలలర। గురుతరప్రీతిపేగుంపులుగూడిదమయంతిఁగ
నుగొనితమలోనతాము। ప్రమదమెలర్పగాబలికిరిట్లనుచు। నీమానినీమణిని
దెజూడరమ్మ। రామాభిరామనిర్భరపుణ్యసీమ। సీమగాదిదిమంచిచెలువయిన
తేమ। లేమగాదిదిమంచిలేమావిరెమ్మ। రెమ్మగాదిదిమంచికలువకెందమ్మి-
తమ్మిగాదిదిమంచిలావణ్యప్రతిమ। ప్రతిమగాదిదిపుష్పబాణునిదంతి। దంతి
గాదిదిరతితగమెచ్చుకాంత। కాంతగాదిదిసీటుగలబోగికన్నె। కన్నెగాదిదిమం
చికర్పూరంపుదిన్నె।దిన్నెగాదిదితావితేటపన్నీరు। నీరుగాదిదిచిన్నెలరాజుతీ
రు।తీరుగాదమ్మ-ఈదేవిలావణ్య।మంతయువర్ణింపనలవియేమనకు। వింతగాన
దియిట్లువేవిధంబులను। వినుతింపనలమహీవిభుడెవ్విధమున।దనరారుశుభము
హూర్తంబునతడు। నగరుప్రవేశించెనాతియుదాను। జగదీశులుమహా
జనులుబాంధవులు। హితులుమంత్రులుపురోహితులునుదదను। మతినేగిర
టతమమందిరంబులకు।నంతటదమనాఖ్యుడామహీశులకు-సంతసబునమ్రొ
క్కి-జననాథయేను।పొలుపొందవూరికిపోయివచ్చెదను।కలకంఠిదమయంతిక
న్యకామణికి- వయస్సుమిక్కిలిలేదువసుధాతలేశ। దయనేలుకొమ్మవిత్తాని
మమ్మెంచి।యనివిన్నపముజేసియాదమయంతి।గనుగొనిమదిబుద్ధిగలిగిభావి
భుని।మర్మంబులెరిగిసమ్మతిభక్తివెలయ।నమిలిసదువుపునయముతోసవ్వు
నరయుంగనూరికినరిగెదననిన।తరళాక్షిదమయన్తిప్పకజూచి- కన్నీటిగడు
బాష్పకణములుదొరుగ। నివ్వాళ్ళవలెనుండకిబుద్ధిగలిగి। మాన్నప్రజలెల్ల
మహిమెచ్చిపొగడ। నన్నికార్యంబులనరసిసద్భక్తి। తల్లిదండ్రులమాటదా
టకరాజ్య। మెల్లనేలుముప్రజలెల్ల సంతసిల్లుటచేత। మెచ్చుకీర్తులచేతమె
లగుమోయన్న। నిచ్చేయుమనుచువేగంబెయతడు। తనబలంబులుగొల్వతన
పురికరిగి।తనతండ్రిగూడిభూతలమేలుచుండె। నంతటనిషధేశుడాదమయంతి
సంతసంబునగూడిసరసులయందు। కేళీవనములందుకృత్రకాద్రులందు। మేలి

మిహాదలందుమేడలయందు । నిరుపమానవిభూతి నిరతంబునిట్లు । సురపభా
పురకేళిసాక్కి-సోలుచును।శ్రీరామచంద్రునిరీతిసంప్రీతి। ధారుణీచక్రంబుతగ
నేలుచుండె।ననియిట్లుబృహదశ్వుడాధర్మజునకు। పెనుపొందమున్న గావిన్న
మాగ౯మున । వరుసతోనలచక్రవతి౯చరిత్ర-సంపదలుమెచ్చవిస్తారంబుగా
గ।వినుతవాక్యంబులవెలయంగ జెప్పె।ననుచువాధూలగోత్రాబ్ధిచంద్రుండు
చిరకీర్తివంతుడాశ్రితకల్పతరువు।కరుణాపయోనిధికందాళదొడ్డ।యాచార్య
నకుశిష్యుడై నట్టివైష్ణ।వాచారతత్పరుడతిదయాపరుడు।పాలుపుమీానచక్రి
పురవిహారుండు।వలనొప్పనతనికివరకుమారుండు-యకలంకమానసుండమిత
పుణ్యుడు।సకలవైష్ణవపాదసంసేవకుండు। రంగనాథాత్ముండు రాజపూజి
తుడు।సంగీతసాహిత్యసత్కళావిభుడు। సరససత్కవివరసద్భూషణుండుయర
యంగనాతనికనుగుసోదరుడు । తనరినయాంధ్రవిద్యాప్రవీణుండు। జనలోక
విదితుండుసజ్జనహితుండు।తిరువెంగళార్యుండుధీరాగ్రగణ్యు । డరయనాతని
పుత్రుడబ్ధిగంభీరు- డమలమానసుడవిద్యావిశారదుడ-రమణనేవరకవిరాఘ
వాహ్వయుడ నరహరిఘటికాద్రినాథుని పేర।పరువడినేనాంధ్రభాషలదెలియ
నవని।శ్రీహరిదాసులయినట్టిసరస।కవులసత్కృపనాకుగలుగుటజేసి। యీనల
కథయందునిదిపూర్వభాగ। మేనురచించితినీచరిత్రంబు। నెవ్వరుజదివిన నెవ్వరు
వినిన- నెవ్వరువ్రాసిననవనీశుకరుణ- నాయురారోగ్యంబులైశ్వర్యములను-
పాయకుండగపుత్రపౌత్రసంపదల- నాచంద్రతారార్కమై యుందు రెలమి-
భూచక్రమునపరిపూజితులగుచు

—:(*):—



# నలచరిత్రము - ద్విపదకావ్యము.

## తృతీయ భాగము.

### దమయంతి పుత్రిల బడయుట.

శ్రీకరచారిత్రశృంగారగాత్ర-పాకశాసనవేద్యభవరోగవైద్య-చిరపుణ్య
కీర్తి౯యాశ్రితనుతకీర్తి౯ - కరుణానివేశ శ్రీఘటికాద్రివాస- యవధరింపుము
పాండవాగ్రితనూజ- డవిరళమతితోడ నాదమయంతి- పరిణయక్రమమెల్లభ

ర్తిశోభిల్ల|నరిమురివినివిస్మయానందుడగుచు| శతములుముకుళించిఘనయో
గిచంద్ర| యెరుగింపుమటుమీఁదివృత్తాంతమెల్ల| ననవుడుబృహదశ్వుఁడాఱా
జుచూచి|వినుమనవేడ్కతోవివరింపదొడఁగె| నంతటకొన్నాళ్లకాదమయంతి
కాంతాలలామంబుగర్భంబుదాల్చె| పరిపూర్ణసోముని బడలించుమోము|దో
రకౌనివేగునిచంద్రునిరీతినుండె| ననివిల్తుపూచెండ్లనందగుచనులమొనలనల్ల
నివర్ణములుగానుపించె|మృదబింబములవన్నెమెచ్చనిమోవి| కదసిమలినం
బుగప్పినట్లుండె- బడలికల్ మేనునబర్వైనందంద- నడుముమందంబాయెనాభి
గన్పడియె- సవరణనల్లభూసలపేరుబోలె -నవిరళంబగుచునూగారుజూపట్టె-
కలికిచూపులచంద్రికల్ బర్వైననగ-పలుచబారెనుగండపాలికాయుగళి|మలి
వేణిముఖచంద్రిడమృతంబురసము చిలువచందంబునచిట్టములెసగ| గగనభా
గంబుయాకరమైనయొప్పు,పగిదికౌదీగెచూపట్టెనానాట|పొలుపొందునవమా
సములుపూర్ణమైన-నలరసమస్తగ్రహంబులువరుస-తప్పకతమతమతావుల
నుండ-సప్పుణ్యాలగ్నంబునందునయ్యింతి- మరువిభుండైనకుమారునిగనియె-
పురుహూతుసమునితత్పుత్రునిజూచి-గురుతరమతితఃకులగురువయిన- గురు
పువసిష్ఠునికోఁరప్పించి- ధారుణీసుతులబాంధవులనాగరుడ- కూరిమినందరి
గూడిరప్పించి - యంతటగురునాథు ననుమతంబునను - సంతోషచిత్తు
డయిజాతకర్మంబు - నలరంగజేయించెనపుడుపుత్రునకు - చెలువుమీరగ
నింద్రసేనాహ్వయంబు- నొనరంగబెట్టిపుత్రోత్సవంబెల్ల-ననురక్తిజేయించెన
పుడుభూసురుల-కాదిభూదానకన్యాదానములను| గోదానములజేసికుతుకం
బెలర్ప-తక్కినవారికందరికభీష్టముల|మక్కువనొసగియిమ్మహినేలుచుండె|
నదియెల్లగనుగొనియాకలిపురుషు-డెదలోనచింతాసమేతుడై యపుడు-దమ
యంతిలోగూడధారుణీశ్వరుడు- కామతునిబడసియీకుంభినినెల్ల- నేలుచు
న్నాడనేనిటువచ్చియెంత-కాలమాయెనుయింతఘనుడాటనెరుగ- నెరిగిననే
నేలనిందువచ్చెదను-హరిహరబ్రహ్మదులంతటివారి-నామాయబడవైతు న
రులునాకెంత- నేమిసేయుదునింకనేవిచారంబు- కామరువల్లనుజెడ్డకోమటి
వలెను- తెమలకవెనువెంటతిరుగబోయెదను- వనజాక్షికినిస్వయంవరమన్న
మాట- వినిదానివరియింతువేవేగననుచు- పురుహూతుకడకేలబోయిచెప్పి
తిని-సురనాయకుడుమున్నసుదతినిగోరి- పోతిమినీవేలపోయెదమనుచు-నా
తోడనతడేలనవ్వుచుజెప్పె|గోపించియప్పుడాకుధరాధితోడ| నేవునచలపట్టిప

గతినైన-కలచిగారించెగాక నేసుచు। పలుదేరంగుల నేలపంతమాడితివి। పుర
హూతుడప్పుడే పోవద్దటంచు-సరసతపలుమారుచాటించి చెప్పె- వీకతో నా
మాటవినకవచ్చితివి। నా కేమి జేసునినవ్వునో యెఱుగ। విచటనాచారంబు లెన్న
డు జేసు-నతివేగ నేనెప్పుడంటబోయెదను- తనవల్ల బొసగనితప్పులుగల వేయ
నియనితలపోసియంతలో రోసి- యింతకాలముగాచి యిక నేనుబోవ-పంతంబు
గాదిదే పట్టునన్వైన- జేరియాప్రతిన నే జెల్లింపకున్న- నారయనన్ను గాదంద్రు
లోకముల- శనియిట్లు మదిలోననందందదలచు- చునుగాచియుండెనశుద్ధి గో
రుచును-నంతటకొన్నాళ్ళకా దమయంతి। కాంతాలలామంబు గర్భంబు దాల్చి
సానబట్టినమరుసరమో యనంగ- మానుగా నొక్కకుమారునిగనియె- ధరణీ
శుడప్పుడు తనసతనూభవకు।నరుదారజాతకర్మాదుల నెల్ల। నేత్రోత్సవంబుగాని
ఖిలంబుదీర్చి-పుత్రికోత్సవమిట్లు బుధులెన్న నడపి- చెన్నుమీరగ నింద్రసేనా
హ్వయంబు।కన్నియకిడె ధరాకాంతుడై వేడ్క। నతడశ్వమేధాదియజ్ఞముల్సే
సి-కుటిలులనడచి సద్గుణులరక్షించి-యాచారవంతుడై యతిధర బుద్ధి- భూచ
క్రమెల్లనభోరువ నేలుచున్నైనా మాట్కి-నిట్లుండి యటు మెకనాడు। వేమారుదా

శనైశ్చరుండు నలుని బట్టుట.

శౌచవిధిసల్పునవుడు-మడిమనోకించుక మాత్రంబు నీట-దడియక పడియున్న ధ
ర్మే:రుండు। ముదమున నదిదెల్లముగ నిరీక్షించి। యుదయుడయి తనకార్యమంత
యీడేర।నపహంగితపదు మేనంతయు దాచి। పనివడి సూక్ష్మరూపమ్ము ధరించి।
యొడలును ఖారమైయుండక నెప్ప- డుడుగక దచ్చోట మాత గానిలిచె- నదిగా
న లేడయ్యోనవనీశ్వరుండు- విదితసత్కర్మముల్వేగ దీర్చుచును, నిర్మలచిత్తు
డై నెలతయుదాను- ధర్మంబు తప్పక ధర నేలుచుండి - యొకనాడు నలవిభుడు
త్సాహియగుచు-నకలంక రత్న సింహాసనసీమ-నిరుగడ హితపురోహితమంత్రి
వంశ- గురులుంగొల్వగ నిండుకొలువున్న వేళ-కలితనరూపంబు కతినరూపంబు

శనైశ్చరుండు మాయారూపియై నలుని వేటకు బోవునట్లు జేయుట.

గలయొక బోయయైయొకనుపట్టైనవుడు-కురుచవెంట్రుకల పైకుళ్ళాయి బెట్టి।గురు
తుగా జిగురుటాకులుగొన్ని బట్టి। సారెకుముదురు మీసములనుల్చుచును-భో
రుసజను దెంచి భూనాథుగాంచి- చెలువందమింటికి చెయ్యెత్తి మొక్కి- మనల
కతినజాతిమాటలననియె-విను సామినాచిన్నవిన్నపంబొకటి- ఘనమైన దేవర
ఘనమైనదౌరవు- మేమున్న వనములమృగముల పెక్కు-సామికైనగణింప శ

క్యంబుగాదు- యిన్నిపోతులుమరిమదవుటేనుగులు- దున్నలుసింగములుల్లోల
గక యుండు- లేడిపిల్లలుదుప్పులేనూరుకోట్లు।కూడియిన్నిలదాటుకుప్పించిదా
టి-పందులువదుల వెంబడిద్రవ్వుచుండు- గుండేటిగుంపులుకుప్పించుదాటు- నె
లుగులచీమల నెగనిల్చిబట్టి-బిలములగుహలందు బెబ్బులిచ్చిరుత- బులులు
గోండ్రిలుచుండు భూరుహాగ్రములు- బెలగువ్వలుగండభేరుండములను-లావు
కల్పిలుకలులకుముకలుజిల్గు-పావురంబులుసాళువడేగగములు- పాలుపొం
దుబహుమృగంబులుఖగంబులును- గలవిట్లు మేమున్న కాంతారభూమి- నా
వింతలన్ని నేమనివిన్నవింతు।భావించికన్నులపండువుగాగ। మేటిఘోటకమె
క్కిమృగములతోడ-వేటలాడగమీరు వేంచేయవలయు- ననవుడు మోదించి
యాత్మనూహించి-యొనరంగ వానికిమడుగరలిచ్చి- యరుగుము రేపటిలాలా
గ మేము-నరుదెన్చెదము వేటలాడంగననిన- వినిబోయవాడంత వేవేగ కదలి-
చనిపురివెడలిఇచ్చటనదృశ్యుడయ్యె-మనుజేంద్రుడంతటమంత్రినిజూచి-య
నురక్తితో వేటలాడన్గవలయు - మనము రేపటికిసమ్మదముదయివర- ననివ
ల్కుచుండగానంతలోపలను- విపుల తేజముమాని వెపకప్పుమీరి- యపరభా
గంబుననర్కుండుగ్రుంక-జగతీశ్వరుడుకొల్వుజాలించిలేచి-నగరిలోపలికేగె
నయమార్గమునను।చలిరేగియంతలో నాల్గుదిక్కులను-బలువయినచీకటుల్బ
ర్వెనందంద-కలువలువికసించెకమలముల్మొగిచె-తళతళవినువీధితారలుబొ
డమె-నంతటచంద్రోదయంబునిద్ధాత్రి-నెంతయు వెన్నెలలెసగె నాపిదప-కమ
లబాంధవుడునిక్కముగనీదిశకు- నమరంగనిదెవచ్చునని పల్కవచ్చె- వేగు
వాడనుబోలె పెలివేగుచుక్క- బాగుగాపూర్వదిగ్భాగంబునందు- చూపట్టె
నంతలోచుక్కలుమాసె - నేవుమీరగపక్షులెలుగించ్చెగూసె- తరిగెకేళీగృ
హాంతరదీపరుచులు।పోరిబోరికుక్కుటంబులుకూయదొడగె-ముదమందితా
మరల్మొఖములువిచ్చె-పొదలకకల్వగుంపులుచింతనొందె-బోరిపోరిపాములు
పుట్టలజేరె తరుచైనభూతముల్తలచూపవెరచె।దనరినయిందునందనవనంబు
నను- ఘనతబూసినకింశుకంబోయనంగ- నరుణోదయంబయ్యె నంతలోపల
ను।ధరణీసురులచేత బాపూజగొనుచు-తపములుహెచ్చునెత్తమ్ములహెచ్చ
తపనుండుపూర్వభూధరమెక్కెనంత- నలరాజుమేల్కనినగరువెల్వడిని- వెల
యంగసంధ్యాదివిధులొప్పదీర్చి- కుంకుమపన్నీరుగూర్చినగంధ - పంకంబు
తనమేన బాగుగానలది-నలువుగాకస్తూరినామంబుదీర్చి - చెలుగుచువిరిసరు

ల్సిగనిండమరిమి-బిరుసువన్నెరుమాలుపొందుగాజుట్టి- సరిలేనిరత్నభూషణ
ములుబెట్టి- వరుసబంగరువ్రాతవ్రాసినజిలుగు- సరిగెదుప్పటిమొలసవుగున
దాల్చి-పాటించికన్నులపండువుగాగ- వేటశృంగారంబువెలయుంగనించి-య
పరిమితోత్సాహుడగుచునలుండు- విపినయాత్రారభేరివేయించెనంత- నపు
డుఈబ్రహ్మాండమదరినట్లయ్యె-భూతలమదరెనభోవీధిబెదరె- భీతిల్లెగ్రహము
లుబెగడెభూతములుజలధులుగలగెనక్షత్రములుర్వ్వాలెకులగిరులదరెదిక్కులు
చీలెనపుడు।శత్రురాజన్యులుసకలంబుడించి। మిత్రులడించినమ్మినవారిడించి-
హయములడించిభటావళిడించి - రయమునవారణరధములడించి- కొందరు
కొండలగుహలరాటవుల- కొందరుబట్టిరిగుండెలుజెదరి- చపలత్రపజలుమూ
ర్ఛలనొందిరంత-నపరిమితోత్సాహులయి వేటకాండ్రు- కురచమీసమ్ములు
గుజ్జరూపములు- బిరుసైనమేనులుపెద్దపిక్కలును- చిరుతవీనులునెత్తనీర్కక
న్నులును- గురువిందపూసలకొనరొప్ప వేళ్ళు - నెఱిమించతలకించునిలిదట్టు
లును- కురుచకాలెలచెంగుకొనలబిగించి-పట్టుచుంగులుమీదప్రబలిదనర్ప-
చుట్టుకానులునిండసురియలుజెక్కి- వీడెముల్ మొలజెక్కి-బిరుదుమాట్టీలు-
బెనగొందువీనులబిల్లలుగట్టి।కడిదిమెకంబులుగరువకయుండ- తడబడబాము
లుతరమకయుండ- వలనైనబదనికలాకంట్లువేళ్లు। తలముళ్ళతిరముగాదాల్చి
మేనులకు-తరుచుగామించుదంతపుబిళ్ళలమరు- చిరుతకాసెలువలచెంపలన
మల- పకలబండ్లనుపోగువారుమోకులును- బలువాడిమీరినపందిబల్లెము
లు-జిగురుకోకలుమేటిచిక్కములురులు- తెగనలిమబ్బులత్రిప్పుడుత్రాళ్ళు-
పిగిలిచెండ్ళమరినపెద్దఈటెలును- జిగివెండికట్లచేచెలగిసింగుణుల్ - మెలపు
సింగంబులమీదనుగదియు- గలిగినవేటకుక్కలునుబంగారు - గొలుసులబ
ట్టించిఘోరావనములు-గలిగిభయంకరాకారులయివెడలి।రంతటనవ్వసుధా
ధీశుడధిక- సంతోషమునమణిస్యందంబునందు - తనయుండుమంత్రియుదన
గూమిసతియు- తనుగొల్వగాప్రమోదంబుననెక్కి- భేరివేయించెనుపృథి
విగంపింప- వాకిదొరలిరువంకలగొలువ- జనకవల్లభుడువెంటజనుదెంచెన
పుడు- గానకానినల్లనికొండలోయనగ-కరమొప్పనవ్వేటకాండ్రువేవేగ-న
రదంబుముందరనందందరాగ- బలుసింగములనయినబారబాసిక- చలమున
గుండియల్ జ్ఞారగుంమెదము-పులియయినగవిజొచ్చిపొట్టేలివలెను- ఇలమీ
దబడగుమ్మయీడ్చి తెచ్చెదము-మదగజంబులనయినమదములడంచి-పదపడి

విడువక పట్టి తెచ్చెదము - దొరసిమిన్నన బారుసుప్పులనయిన - బిరబిరఖం
డించి బెరికి తెచ్చెదము - హరివరాహంబులనందందదరిని - జిరజిరఖండల చెండి
తెచ్చెదము - పులులగానములబానీక చేతి - బలిమిబల్లెంబుల పాలు జేసెదము -
ధరణీశ యనుచు పంతములాడుకొనుచు - నరుగుచో నెదుట నింపయిమాతు
లుంగ, భల్లాతకీపారిభద్రమధూక - సల్లకీకురువక సాలహింతాల, బదరితింత్రి
ణిబిల్వపాటలిక్రముక - కదళీకటాశ్వత్థఖర్జూరలుంగ - పనసవిప్పలనింబబంధూ
కసరళ - ఘనసారతాళమాకంకాదితరులు - ఘనపదకంబుచుక్క - సరాయుడుం
డ - గొనకోరిముప్పిరిగొనుచు నేలాది - మల్లికాదిశలతన్మహీజకుంజముల - న
ల్లివనవిరళ్ళియడకనియిపుల - యడవిప్రవేశించియారాజవిభుడు - కదువడి
మేఘముల్ ఘర్జించినట్లు। మదమొప్పశింజినిమ్రోయించెనపుడు। బెదరెమృ
గావళిభీతిల్లికలిగి - పిలపిలచెవులెల్లిబిక్కరించుకొని పొనసివల్దిక్కులుజూచు
చుచుండ - పిడుగులకంటెను బెడిదమైనట్టి - కడువాడిమాపులొక్కటనలుండే
య - తనువులనాటినతత్తరింపుచును - కొనిప్రాణములుకొన యేటియేను
గులు - విలవిలప్రాణముల్విడుచుసంగములు। బలు నెత్తురుదోగిపడెడు బెబ్బులు
లు - వడిమెడద్రెగి నేలవ్రాలుదుప్పులును - బడిబడిపోలేక బడుగండకములు -
యురములు వ్రెగి నేలదొరుగుదుప్పులును - శిరములు దెగిపడుశిగ్గిలీకములు - ప
లుమారుగూయుచు పడెడు జింకలును - తెలియక భయమున దెల్లు నక్క
లును, యవనిపైబడిపొరలాడుపందులును - తవిలినపొదలలో దాగుకుందేళ్లు
లీకీతిమృగముల నేపడగించి। ధారుణీశ్వరుడంతదయదాల్చినిల్చి, వేటగావించి
న వేటకాండ్రిడవి - దాటించి సుదిదప్పి దారినిబట్టి - ఘనమృగంబులమీదగది
యుచు బ్రీతి, గొవనేవులనుసని చికొలిపి బాణముల - పదములుఖండించి పా
ర్శ్వములన్నరికి। రథములు గెడపికరంబులుద్రుంచి। నఖములుదునిమికర్ణములు
చేదించి - ముఖములు జెక్కి కొమ్ములనుగ్గుజేసి, నడుములునరికి చూర్ణంబుగా
వించి - తొడల చెండాడి కుత్తుకలుత్తరించి - ముక్కులు చెక్కులు మూపులు తొ
లలు - పక్కలు బిక్కలు బరులుసుదరులు - కరములునురములుగాళ్లును వ్రేళ్లు
శిరములుపిరుదులు చెలువఘాటంము - లత్తరియుడియదినని చెప్పరాక - కత్తుల
పచ్చడిగాగోసిరట్లు - తుత్తుమూరై యాపుదోపకకలసి - నెత్తురుమడుగుల నెరిదేలి
యాడ, వలలొడ్డియకులొడ్డినాగులుగట్టి - కలయమచ్చు జల్లి కనుములుగట్టి
యేజాతిపక్షులు యేరీతిబలుకు, నాజాడపల్కునప్రడుపిల్చుచును - దిరుగుదు

త్రాళ్ళనుదెరగొప్పగట్టి- యురులొడ్డిజిగురులనుసురుగాలపాల- సాళువంబు
లమేటిజక్కవంబులను- లాలనలాడెడు లావుకంబులను- కరముల జిలుకల
గాంచపక్షులను- భ్రమయించిపురారేండ్లపావురంబులను। బెళుగువ్వలను
కొంగపిండునసిట్టు। పులుగులనన్నిటిని భోరునబట్టి- వేటచాలించియాపృథివీ
శుకడకు- మేటిబంతంబులు మేటిబల్లులును - కరిసిరంబులలోని ఘనమౌక్తిక
ములవరుసతో పునుగుజవ్వాజికస్తూరి- కడువేడ్కకొని తెచ్చి కానుకలియ్య
టడయకననియెల్లదమయంతికిచ్చి- పరగంగవానికిబహుమానమిచ్చి- ముదు
పునదనమంత్రిమోము వీక్షించి। నలవులనీ వేటతమకంబువలన-తలకొని మన
మెంతదవ్వొవచ్చితిమి- యనుచునుదనపురికరుదెంచు నెడను- దనరినవనిదేవ
తల వేడ్కజూచు-బాగయిననిద్దంపుస్ఫటికదర్పణము-లాగునవీలోత్పలంబుల
చేత-తరుచయినకమ్మకెందమ్ములచేత। మెరుగులనీలపుగుడ్లు మెచ్చగతీరు-మె
రయించు మేటితుంమెదదుంపుచేత- గరమొప్పమంచిచెంగల్వచేత- పయిడిరె
క్కలుగలపక్షులచేత-వాడిగోకులగోరవంకలచేత-బలువుగానున్నటిబకము
లచేత-సలలితంబుగ క్రౌంచసంగంబుచేత- క్రమమొప్పచక్రవాకంబులచేత-
రమణీయమైతదారావనింద్ర-కలకలశబ్దసంగతమైనయొక్క- కొలనుగనుం
గొనికువలయేశ్వరుడు-తరుణియుదానున త్తరి తేరుడిగ్గి- కరతలంబునమంత్రిక
రమూదుకొనుచు-జలజాకరముజొచ్చిజలములగ్రోలి- యులరంగనచ్చోటన
తిచిత్రముగను- చెలువుమీరగజగజంపుగాప్రజలి- విలసిల్లుసహకారవృక్షం
బునీడ-నరసిజపత్రముల్జాలంగ నెరసి- యిరవుగాతలిరాకునానతంగ జేసి- ప
రచినమృదుచారపానుపుమీద, ధరణీసురుడతులమోదంబుతో డుతను-తల
పునదమయంతి దమయంతితోడల - తలగడగా జేసి తగవిశ్రమిన్చి- గురుతు
గామునువంపుకొనలనవచ్చు-సురటివటుపగాలినుడియుంటదిప్పు। నలతతోక
నుమోద్పునంతలోపలను - కలిగియొప్పసికగనిమేలుకాంచి- దిగ్గునలేచినల్లి
క్కలుజూచి, యగ్గలంబుభీతినందందవడక-నమాన్యనవాధీశుడప్పుడుచూచి-
యుంమానినీమణియతిభక్తితోడ- నరుదయిన కెందమ్మినలరించుముద్దు- కర
మున చెలువందగావీవుజరచి-రమణీయముగునవరత్నకంకణము- రమణుకప్పు
డురతగాగట్టి- యిదియేమివెరచితియినకులాధీశ - మదిలోననీవుసామాన్యు
డవనెను- వక్రంబునీభూమివసియింపనిక- చక్రంబుపనిశేయజగము నేలుదు
వు- ఘనుడవునకలగుణగణోన్నతుడ- వనుపమజయశాలివర్కవంశజుడ-

వనితన్ను దెలిపినయాపుష్పబోణి- గనుగొనినలమహీకాంతుడిట్లనియె- నెల
నాగ యేమనయెరుగంగరాదు- కలగకకాలగానికలగంటినిపుడు - తెలియజె
ప్పెదదాని తెరగెల్లవినవే- యలివేణియారాజ్యమంతయుమనము-విడిచివేద
లబొందివిపినంబులోన-నుడుగకనిర్ద మొకచీరగట్టి- పరువడిబాధలగొంతకా
లంబు- మరిగినపిదప శ్రీహరికటాక్షమున- మనము రాజ్యసుఖాప్తిమనగంటిని
ష్పా- డనియిట్టుదుస్స్వప్నమధిపతిజెప్ప- వెరచిదావెరణనివిధమునబలికె| న
రయంగదీనికినడలనేమిటికి-నందుల కేమి శ్రీహరియాజ్ఞమీరి - పొందునేదుః
ఖంబుభూతలాధీశ- సత్యమేజయమనిసకలశాస్త్రముల-నిత్యంబుగాబల్కు-ని
ఖలంబులోన|నిటుగానసత్యంబునధికధర్మంబు-పటుగతిభాగ్యంబుసంపదగల్గె
మనకు-ననియిట్లగా మ్రోయవాణినాకాశ- ధారుణీనాథుండుతనపురికరిగె|
వెలయుచుకలిమాయవేగొక వేళ- తెలిసియుదెలియని తెరవునమండ- భీముని
వరపుత్రిబిసరుహనేత్రి - భామాలలామనిర్భరగుణోద్దామ- పరమపతివ్రత
బహుధర్మనిరత వరరూపవిభవలావణ్యప్రహరి- దమయంతిసత్యంబుదరలం
గనీక- నమరినవేడ్కతోనప్పటప్పటికి- తనప్రాణవిభునకుధర శాస్త్రముల-
ననురక్తిజెప్పగానతడుసత్యమున- చెలువంద రాజ్యంబుచేయుచునుండె- కలి
రాజుమరికొంతకాలంబువెనుక-మనమునదలచియుమ్మనుజనాయకుని- ఘన
ముగానేదన్న కపటజూదమున - కలరాజ్యమెల్లనక్కటలవోడించి - తొలగి
జేసెదతొల్లకానలకు-నలనాడుధరణిధరారాతితోడ-బల్కినపత్రంబు బబ
లజెల్లింతుననియొక్క- చెనటిబ్రాహ్మణరూపుదాల్చి|తనుదోచువారలందరున
వ్వుచుండ-కురుకుసల్లనిమేనుకరినస్వరంబు|కుసుచపాదంబులక్రూలదంష్ట్రల
ను- విల్లువంకలకాళ్ళువిరిసినబొమల-పల్లమీసంబులొప్పనిగుంటకనులు- న
రసినగడ్డంబునడ్డిని సికయు- బహువుగాబట్టినపట్టపర్ధనము- కడిదిబింబోష్ఠం
బుకడుబొక్కినోరు-నిసుపయునమెడయునునిక్కనరోమ్ములు, బలువునామూసిన
పాతధోపతియు, వెలయగచేనొక్క వేయుదండంబు-పలనుగాజిగిముడివైచు
జందెంబు- కలిగిభయంకరాకారుడయినలుని-దాయుపుష్కరుడనుధారుణీ
నాథుడాయెడతనవారలందరుగొలువ|బొలుపొందతనపురంబునచిత్రమలర
గొలువున్నయత్తరి గొబ్బునబోయి - భుజగంబుకయిపడి బోడగాంచియుత
ని-విజయోస్తుయనుచుదీవించియిట్లనియె- నన్నెప్పుడోయుసినరనాథబుద్ధి-నె
న్నకుకలియునియెరుగుమునన్ను-దురితకర్మములకుడారవగునాకు-సరియైన

**శనైశ్చరుండు పుష్కరునితో నలునియొద్దకేగి జూదంబాడుమనుట.**

వాడుముజ్జగముల లేడు-హరిహర బ్రహ్మాచక్రాదులనైన। తరలకపెక్కు బాధ
లబెట్టువాడ- మనుజేశ నన్ను సామాన్యుండనందు- నొనరి మీమతిలోననుం
చకుమెపుడు-విరసతనతడేమి వెరబెట్టదలచి- యరుదెంచెనోయనియడలకునీ
వు- పన్నుగానీకొక్కపని చెప్పదలచి-క్రన్నన నేను నీకడకువచ్చితిని- యనిమ
రి వేవేగ నావని సేయ-మని నీవు వినకున్న మాచిత్తమొదలు- నవనీశ యాకార్య
మంతయునిపుడు। వివరంబుగా నీకు వివరింతునింక-నలి వేణి దమయంతి యనియెం
డుకాంత- కలదొక్కయువతి చక్కనిముద్దుగుమ్మ। నలిసాక్షి పుట్టిననాటనుం
డియును-యలరుచు నే బెండ్లియాడెదననుచు- కాచుచుండగ నన్ను కాదని మి
గుల- నాచంద్రముఖి బెండ్లియాడిమాణిక్య - ములవంటియిద్దరు ముద్దుబిడ్డల
ను। యలరంగగాంచియీయవని రాజ్యంబు। నేలుచున్నాడు నన్నెంచక నలుడు
తాలిమిగొందుచిత్తంబిట్టిపనులు- సరిపోయియుండు నేజగతి నెరికిని - యరు
దెంచి నేపెండ్లియాడెదుదాని- నెలమిదానువరించ నెంతటివాడు- బలభేదిక
న్నదిక్పాలురకన్న।నరనాథ ధారుణీనాథులకన్న। సరసత నాకన్న చక్కనివా
డా। నలుడంచు వానియానాతి వరించె-నిలతలాధీశునికిది సమ్మతంబె।ఎంతైనన
లుడు నాయిష్టమారయక, నింతకార్యము చేసెనికకూడుమైన। నేమాయ వేవే
గనిట్టిజూదంబు। నామహీశునితోడనాడుము నీవు। చెలువందవాని పాచికలలో
నుండి-నిలిచియాడింతు వేనిఖిలరాజ్యంబు। నేకచక్రముగాగ నీయిలనెల్ల। చే
కొని వేడ్కనీచేత నేలింతు। నన్ని కార్యంబులకలరుచు నేన-యున్నాడ నీకేలను
ర్వీశ భీతి- యనవుడు సంతోషమంది పుష్కరుడు- వినయంబు చేకలి వేల్పునకని
యె- పోసగంగ యేను నీబుద్ధులు దాట- వసుమతి నేనెంతవాడనో దేవ - యా
రూఢిజూదంబులాడెదననుచు-నారాజకడకు నేనరిగితి నేను - సరసతనలుడన
సముడనటంచు-నెరిగినాతో పంతమిడిభ్రష్టసట్లు। లాడు నేజూదంబునతడువద్ద
నక। వేడుకతోడుత నుమేనుజనిన- నన వుడు నేవానియాత్మలోనుండి-యను
రక్తితో జూదమాడెదు బుద్ధి, బుట్టింతు వేవేగ బొమ్మునీ కేల।నిట్టివిచారంబు లేగ
తినైన-వానితో సరిపోరి వాని రాజ్యంబు-పూని నీకియ్యక పోనునీయాన-చెలు
వొందరాజ్యంబు సేయుమటంచు, కలికియదృశ్యుడయి పాపవల్లభుడు-జనియె
నానలమహీశ్వరుడొక్కనాడు-మన సెలర్పగసభామంటపంబునకు- చనుదెం
చి సకలరాజన్యులు భటులు-ఘనమైనమంత్రిపుంగవులు బాంధవులు- హితుల

గాయకపురోహితులునాశ్రితులు। నతివేడ్కఁగొలువసింహాసనమందు। నమ
రంగఁగూర్చుండినతివేడ్కతోడ। రమణులువింజామరంబులువీవ। వారకభ
టులుకయివారములు సేయ। సారెకుసజ్జనుల్ సన్నుతిసేయ। కవివన్దిమాగధుల్
గడగికీర్తింప। ప్రవిమలసకలసంపదలచేనిట్టు। దివిజులతోనున్న దేవేంద్రుప
గిది।కువలయేశుడునిండుకొలువున్న వేళ।జననాథుకడకుపుష్కరభూవిభుండు।
తనవారలెల్లమోదంబునగొలువ। చనుదెంచియతనికిసద్భక్తిమ్రొక్కి - వి
నుతులుసేయనవ్విభుడుపుష్కరుని, యనుపమగతినొక్క యాసనము
న-నునిచినయోడించినుచితవాక్యముల। బరిసామమేయనిపార్థివునడుగ।హర్ష
కటాక్షంబుననందందమాకు।ఘనతరసౌఖ్యంబుగల్గునెల్లపుడు। మనుజాధినా
యకమరినీకుశుభమె। యనవుడునీదయనవనీతలేశ- యనుపమసుఖముగాక
సుఖంబుగలదె। యనవుడునిషధభూమీశుడిట్లనియె। నెనయగపుష్కరాధీశు
నిజూచి। ధరణీశనీవేమితలపునదలచి।కరమొప్పనేడుమాకడకువచ్చితివి-యె
న్నడురావునీవు తెంచుటరుదు। క్రన్నన వచ్చినకార్యంబుచెప్పు। మనవుడుపు
ష్కరుండవనీశుజూచి।గొనగొనినినుజూడగోరివచ్చితిని। ఇదియెంతకానియొం
డేమియులేదు। మదమందిమంత్రోనముచ్చటదీరె। మనమిద్దరముగూడిమరి వే
డ్కజూద। మనురక్తిమీరంగనాడుదమనిన। ధరణీశలేకుండు తలయూచిప
లికె। ధరలోనమారుజూదంబాడతగదు। ప్రవిమలసత్యసంపదబాసిపోవు। న
వివేకమొలయుదురాగ్రహంబొదవు। నటుగానజూదంబునాడంగతగదు। యి
టువంటిపనిసేయుటనహర్మమేమునకు। ననిపల్కుచుండగానప్పుడుకలియు। మన
మునప్రేరేపమదిజూదమాడ।గోరిన్యాయమిమ్ముకున్కువలయాధీశుని। గారవించి

పుష్కరుండు నలునితో జూదంబాడుట.

నలుండుకడకనిట్లనియె। పగడసాలాడంగప్రమదంబునొంది। జగదీశయిచటికి
చనుదెంచినపుడు। నినుచిన్నబుచ్చగానీతిగాదింక।ననురక్తియొకయాటయా
డుదమనుము। మేలిమిపైడినిర్మించినపగడ। సాలదెప్పించియచ్చటనక్కప
రచి।తి మొప్పగానాల్గువిక్కులయందు। సరగునసారెలుచక్కగానిలిసి-యె
నరంగపందెమేమనినలుండిట్లు-లసినిపుష్కరుండనియెనవ్వుచును। ఇనకులా
ధీశ్వరయేనోడితేని।ననిబూనియేలుమీబంటనయ్యెదను। నేపునవీరుగకనీవో
డితేని। నీరాజ్యమంతయునెమ్మినాకొసగు। మనెనిట్టిరెయొడబాటు కాత్మలో
మెచ్చి। వెనుకొన్న వేడ్కతో వెలయపుష్కరుని। తోడరిజూదంబాడదొడగిన

లుండు।తడయక మేటిదంతపుపాచికలను। యమరించియొక బాలయనుచుదో
ర్లించి। సమముగాదుగదచ్చిచౌపంచపగట। యిత్తుకతానివారలిరువురునా
డ।నత్తరిపాచికలందుండిమరియు। కలినలధారుణీకాంతునిచేత। బలుమారు
పందెంబుపడకుండజేయ। నలుడదిచూచివింతగదాయటంచు। చలముకోపం
బురోషంబునీమాడు। ముప్పిరిగొనగనామురువుననాడ। నప్పుడుకలిమాయ
యనిగానలేక- సరిలేనిమత్తగజంబులనోడె। కరికరిగజతురంగంబులనోడె।క
డగినిండినధాన్యకణజంబులోడె। పసగల్గుబంగారుపల్లకిలోడె। మసలకఛత్ర
చామరములునోడె।రంగయినదివ్యాంబరంబులునోడె। సంగీతముల బాడుసఖ
యలనోడె,కొమరారుముత్యాలగొడుగులనోడె,రమణిచ్యామగుధనరాసుల
నోడె।వారకభటజనవర్గంబునోడె। తేరులనోడెమేదినియోషులెరిని,సచివుండు
మదిలోనసన్తాపమంది।యుచితవాక్యంబులనుర్వీశుతోడ।ననియెధారుణీయుం
దునోడె యనఘులకిట్టిదుర్వ్యసంబుగలదె. యిదియేమిపనియిప్పుడుదోచె.
మదిలోననిట్లాడమరచితేసేతి, జూదమాడుట యేమిపౌరుషము రాజేంద్రనగ
రికిరందుపోవలయు, నదెనిన్ను చెలులురమ్మనిపిలచెదరు- యిది వేళగాదునీవిం
తటనిలువు,ధరణీశయాకలిదప్పులుమరచి।తరలకయాడంగధర్మంబుగాదు.
లేతెమ్మయాటచాలింపుము వెనుక. నాలాగె వేంచేసియాడెదుగాక.ననిపట్కా
చెయిపట్టియవతలికిదీయ-కనులనెర్రగజేసికనుగాంచిసింహ. మూరకజూచిన
రీతినూరకజూచి, పరువడిగజిగాంచిపలికెభూవిభుడు. నీకేలనిటువంటినీతులు
చెప్ప. చేకొనియెవ్వరుచెప్పిరమ్మనిన। విడువిడుమని చెయ్యివిడుపించుకొనుచు
నుడుగకకలిమాయసొగియాడదొడగె, నప్పుడుచింతించియామంత్రివరుడు.
తప్పకనలుడుజూదంబాడు తెరగు. చేరివద్దనిబుద్ధి చెప్పినవిధము. ధారుణివా
క్కటిదక్కనంతయును. యురువడితోడుతనోడిన తెరగు. చేరివద్దనిబుద్ధి చె
ప్పినవిధము. ధారుణినొక్కటిదక్కనంతయును. యురువడితోడుతనోడిన తెర
గు. కలియాతమకోపగించిన తెరగు। దమయంతికప్పుడు తగజెప్పిపని చె-
దమయంతియపుడు సంతాపంబునొంది. యిదియేమిపనివచ్చెనితనేమిసేతు-
వదలకతనమంత్రి వాక్యంబువినక, సదయుడయి ఈరీతియాడినయపుడె,యిది
దయివమాయయెయుండేమియునుయంచు. మదిలోననిశ్చనుమానంబువలన. దిది
యాదిగానింక నెట్టిదుఃఖంబు, పొదవియేగతిమమ్ముపొందనున్నదియొ.పదవడి
దుస్స్వప్నఫలమెల్లనిపుడు. దదియేలనోనిచ్చునుభవించకను. నుదుట నేమ

నివాసినే సోమన్న బ్రహ్మ తను జేయపూర్వకృత్యంబును దాట. వనజాసనా
దిదేవతలకువశమె. యిటువంటిజూదంబు లెవరయినమన్న. తటుకునవాడికే
ధరణిలోననుచు, నప్పుడుపౌష్కరేయుడ నెడుసారథిని. తప్పకరప్పించితగనంత
చెప్పి, కొడుకునుకూతునుగొని వేగనీవు. తడయకమాతల్లితండ్రులవద్ద. విడి
చియిక్కడనున్న వృత్తాంతమెల్ల కడువేగ నెరిగించికదలిరమ్మనిన. వరునయిన
యొక మేటియరదంబుమీద, నిరువురుబిడ్డల నెలమినెక్కించి. వరువునదోడ్కొ
నిపౌష్కరేయుడపుడు, వరగంగయావిదర్భపురంబు జేరె. నప్పుడువురనువారం
దరుగూడి, తప్పకతమలోనతామచింతించి. తలపోయదొడగిరిధారుణీశ్వరు
డు. చెలువందరాజ్యంబుచెయుచుండగను సకలజనావళిసంప్రీతిబొందె, నిక
నెట్లకోయెరుగంగరాదు, పోడిమిమనమయినపోయిజూదన్న, నాడన్గవలదని
యరసిచెప్పదము. మనమునతనమంత్రిమాటలువినిన. మనుజనాథుండుమన
మాటలువినునె. పూనిశుభాశుభంబులు రెండుతనవి . యనియని దెలియక
నాడుచున్నాడు-జూదంబునాడెడుచోరపుష్కరుని. వాడించిపోనీలువారు
లేరయిరో. యలరిభూపతిజూదమాడంగబోవ. వలదంచు బెద్దలెవ్వరు జెప్పరై
రో. యవనీశయీజూదమాడ రాదనుచు, నెవరయినభూజనులెరిగింపరయిరో
ఘనమైనకర్మములగదనీనవెనుక. వినవచ్చునేయదివిఘ్నవకయిన!నైననుమన
మిప్పుడదరిమేగి. మానుమీజూదంబుమనుజేశ యనుచు. పలుదెరంగుల జే
రిపలుకుదమెుగిని- చెలరేగిమనమేమి సేయబోయెదము జూదమాడుటవసి
ష్టుడెరిగియున్న. కావనిమాన్పజేకష్టజూదంబు. నికనైననమ్మవు నీవిటకేగు
దెంచి. యకలంకమతితోడనారాజగాంచి! యాడగూడదుజూద మాడకు
మంచు- నేడుజెప్పినగానినిలుపునేరాజు. మనమాటనిపుడుసమ్మదమునవినునె.
యనిపౌరజనులెల్లననుమానమునను జనిచనినలరాజచంద్రునిగాంచి మును
కొనిభయమునమ్రొక్కియిట్లనిరి . మానవాధీశ్వరమమ్మాగావలసి . మాను
మీ జూదంబు మదినమ్మరాదు - కపటమైయున్నది గానయీజూద - మి
పుడుజాలింపుమాయిందరితోడ - పైరానివనిసేయవలయునేరికిని - యవనీ
శగెల్పులేదమ్యోనింత్రైన! తవిలియాటవిడంచెతగదింకవిడువు!మనవుడువారల
నవుడాగ్రహించి- కనుగొనిచెవ్యెత్తిగర్జించిపలికె - జేరినాకునుబుద్ధి జె
ప్పమటన్న- వారెవ్వరనుచుదుర్వారోగ్రుడగుచు- కలియుక్తుడగుచు నాక
లిగొన్నయట్టి- పులిబోలెగర్జించిపోదోలెప్రజల- నీరీతిబ్రజలంత రేగివెను

కీ - నా రాజుమరి జూదమాడుచు మరల - తనదయిన రాజ్యమంతయు నొడ్డబెట్టి
వెనుకొన్న కనిమాయ వెతచేత నోడె - చప్పన్న దేశ రాజన్యులు నున్న - క
ప్పంబు దెచ్చిన కానుకలోడె - నవఖండభూమిఖండలములనోడె - నవలక్షప
ర్వతనందులనోడె - నలువొందనాడెడు నాల్గుదిక్కులను - ఇలయేడుదీవుల నె
ల్లను నోడె - కట్టుచీరెలతోడ కరమదీ నిలిచి - యట్టిట్టు దోలుగ కనన్నలుడు
న్న! నతనిగన్గొని పుష్కరాఖ్యుడానలుని! నతికిన వ్యార్తనిచ్చలు జెప్పినను వ,
దమయంతి యదివిని తనమానంబునను! గ్రిమ మొప్ప చింతతో గడువెరగంది!
యంతఃపురంబున నప్పుడు వెడలి। కాంతలు పురజనుల్గడు వెరగంది। చూచు
చుండగ నాసుందరి సభకు! రాజధర్మము మానిరయమున వచ్చి। యిదియే
మిభూనాథ యీచోద్యమనిన! దనయుడయి యేమనన తడూరకుండె! నప్పుడు
పుష్కరుండడిచూచినలుని। తప్పకనిప్పుడే తరుణితో గూడి! యీరాజ్యము
ననుండకే కానకయున! జేరబొమ్మనినయీ క్షితిపతి చూచి!నలుడిట్లులనియె నో న
రనాథచంద్ర! సలలితంబుగ మేముచని యెదనింక! కలిరాజు మమ్మింతగాసి బె
ట్టగను! యెలమితో నడవికి మేముబోయెదము। నీవింక నిర్ధారణి యేలు మరి
ట! యీవిధి జేసె నేమందింకననుచు! ప్రతిమలంబుగ మంత్రి పాటించి తెలియు! నే
వివరింపనేనేల వినక పోయితిమి। కర్మమేమి సయినగాపించుగాని! కర్మ
ము చేటును కర్మమే కీడు! కర్మమే సుఖదుఃఖకారణంబగుచు! కర్మంబువ
చ్చిన గైకొనకిపుడు! పొమ్మన్న పోవునో పూర్వకృత్యంబు! ఇమ్మి చూలికినైన ధ
రవైరికైన! హరికైన సతిమనోహరునకునైన। నరులకైనను మనుష్యులనం
గనెంత ననుభవించక తీరదదియెల్ల నిక్కమని ఇట్లుతలపోసి నపుడాత్మపత్ని
గనుగొనిపలికె నుక్రమముతో దాతను! రమ్ముకానలకు సమ్మతిపోవ వలయు! మ

## నలదమయంతి నడవి కేగుట.

నమున నీకచింత మానిరమ్మనిన! వినియాసతీమణి విభునివాక్యంబు! జనదా
టకమ్మడే సమ్మతి నెడలె! సవనీశుడింతితో నడవికిజనుట. పురజనులాలించి పుర
పురబొక్కి వెరచుచు తమతమవీధులనిలిచి! గుంపులు గూడుక గుజగుజరాగ దం
పతులను జూచితపాతపబొక్కి! రక్కటాయిట్టి మహాపుణ్యాతులు! కిట్టికష్టము
బొందుకేటికి గలిగె! నిటువంటి యాపద లేటికివచ్చె! నెటుపలెపోవునో యేమి
సేయుదము! వీరు పుణ్యాత్ములు వీరుసజ్జనులు! వీరికియాపదవిడుచునెద్దానా! నని
యిట్లు పురజనులు పలుమటపడుచు। తనుబ్రోడ వారలతానుజూడకనె! తలవంచు

కొనుచును తగుసిగ్గుతోడ. కలిబాధతగిలిన కతముననిట్లు. పురవీధులప్పుడు
పొందుగా వెడలి, పురపురబొక్కుచు పురినిర్గమించి, కరము జింతింపుచు
గాంతతో గూడ, దొరకొనిదయివంబు దూరుచుజనియె। నక్కడపురజనులంద
రునప్పుడు। రక్కసిపుష్కరారాజనీ వెరచి। దమయంతితో నలధరణీశ్వరుండు। త
ముబాసిచనుటకాత్మనేగుందిరంత। రప్పుడునిషధేశుడా పురివెడలి। తప్పకదమ
యంతితగజూచియనియె। నేమి నేయుదుకార్యమికతప్పిపచ్చె। కానినీమనమిం
కగానలయుందు। దైవతంత్రమునని త్తరినుండవలసె। దైవంబుననేలతమక
ర్మమిటు। బాధింపుచుండంగవగబట్టినట్లు, వేధించిపుష్కర విభుఁడుబాదం
బు। నాడిసంపదలనన్నిటగొనిపోయె। పోడిమిచెడిఇట్లుపొగలంగవలసె। ధర్మ
మార్గమునందుదనరుటమనకు । నిర్మలబుద్ధినినెక్కొనుచుండు। ననియు
ట్లుదమయంతినట్లూరడించి। పనివడిపురసమీపమ్మునసదనరు । నొకపర్వతము
గాంచియురువివేకమున । నకలంకచిత్తులై యప్పుడిద్దరును। యుపవాసమున
నుండియుదయమైనంత। నపరనిత్యాయాసులంబ్రోవబట్టి యావనభూమిలో
నప్పుడిద్దరును। పోవంగపోవంగ పొదరిండ్లనడుమ బ్రహ్మసమానుండు బ్రహ్మ
షీవరుడు। బ్రహ్మలోకమునుంచినచ్చినట్లున్న। యావసిష్ఠునియుంచియంత
మోదమునను సావధానముతోడ సారెకు మ్రొక్కి। నలరాజపందుమ్రిందునయ
ముమీరంగ। గులకాంతతో గూడగురుభక్తియుక్తి। మ్రొక్కినగనుగొనిముని
నాయకుండు। నక్కజంబుగజూచియప్పుడిట్లనియె। నిది యేమి జననాథ యిం
దువచ్చితివి । ముదితతో గూడనీమొదమెల్ల దొడగి । యీవిధిజను దేరనేటను
గలిగె। ననిమునిపలుకంగననీవిభుండు। గనుగొనిసంతోషకలితుడయిపలికె-
నోవసిష్ఠమునీంద్రమోదయాసాంద్ర। నావిన్నపంబెల్ల నయముగావినుము।
గతజన్మకర్మసంసారఫలంబు। కతననీదురవస్థగలిగెమాకిప్పు। డెరిగియెరింగియు
ల్లలనన్నడుగ। నరుదంద బేలనేనయివిన్నవింతు। తోడరిపుష్కరరాజుతోజూ
దమాడి। పుడమినిసంపత్తిబోవిడిచియోడి। మానినితోడసమ్మదముననిపుడు।
కాననభూమికికదలిపోయెదను। పరమయోగీంద్రదనీపాదపద్మములు। కర మొ
ప్ప సేవింపగలిగెభాగ్యములు। యనవుడుహాయనియమ్మునీశ్వరుడు। తనమనో
దృష్టిచేతప్పకజూచి। పెరగందియమ్మహావిభునకిట్లనియె। ధరణీశముమ్మ నీదమ
యంతి పెండ్లి। యాడిననీమీదనది నెపమెన్ని। పోడిమిచెడకలిపురుషుడిట్లే చె।
మంచిదండులకేమి మహిమశోభిల్ల। మించిననత్కీర్తి మెరసెదవీవు। కర్మవ

శంబునగలుగు బాధలకు। ధర్మమావదలకుదలపకుసుఖము। మదిలోనసత్య
మమరువరకు మెప్పుడు। పొదవినసౌఖ్యంబుపొందెదవీవు। ఖగపతిపైనెక్కి కమ
లావిభుండు।వగపెల్లమాన్పిబోవగజూచునిన్ను। వెరవకుమనిపల్కి విభునివీ
డ్కొలిపి।సరగునమునినిజాశ్రమమునకరిగె।నంతటజననాథుడాసమీపమున।
వంతలగుందుచువాసరత్రయము।నుపవాసములనుండెనువిదయుతాను।జను
లువుమ్మరభీతిజనరెవ్వరటకు।భూకాంతుడప్పుడాపొలతుకజూచి।యాకటిపె
ల్లునవందందబలికె।నలినాక్షిపూర్వజన్మమునమనము। తెలియకమునిమూడుది
నములనెవరి। నుపవాసములగుందనుండజేసితిమొ। చపలాక్షిమనకునీజన్మం
బునందు। నూరిటుందరకాన నుపవాసగతుల। నూరకమూడు నాళ్లుండంగ
గలిగె పెట్టినవారికిపెట్టుదయివంబు। పెట్టనివారికిపెట్టదుసుమ్ము। జలజాక్షిక
లిమియేచక్కదనంబు।కలిమిగలిగిననాడుకలరుబంధువులు।కలిమియేసౌఖ్యం
బుకలిమియేసుఖము। కలిమియేచుట్టాలుకలిమియేసఖులు। కలిమియేసతులి
కకలిమియేసుతులు। కలిమియేసకలంబు కలిమేయువలసు। కలిమిబోయిన
వెనక కడగిచుట్టంబు। లెలనాగయొకరయిన యిందురారియిరి। పుడమిసౌ
ఖ్యంబుపొందినవారు। చెడినయప్పుడు చెంత జేరంగనియ్య। కలదుచుపుమ్మ
రుడాడుజాదంబు। చెలియరోయదిజూడ చిత్తమయ్యెడిని। యిదిదయివమా
యయెుండేమియు లేదు। మదిలోననొకచింతమంటిబొలదింక। విపినభూముల
లోన విహరింపవలయు। నిపుడునీకొకబుద్ధి నెరిగింతు వినుము। శృంగారవని
ములో గ్రీడింపలేని। యంగనవనినెట్టులసంచరించెదవు। మునుసౌధసోపానము

## నలదమయంతు లడవిలోనడవలేక దుఃఖించుట.

లనెక్కలేని। వనితమెట్టెక్కుదువసుధాధరముల। స్ఫటికంపుమేల్కట్లపైనె
క్కలేని।కుటిలకుంతలిమెట్టుగుట్టలెక్కుదవా।యరుదయినరత్నగేహాళిదాట
లేని।గరితయేగతిదాటగలవుఘట్టములు। నావెంటనదిగాకనడువంగలేవు.వారి
బిడ్డలవద్దికిబోయి। నీతల్లిదండ్రులనిలయమందుండు। నాతినీవేడకానభూమ
లేడ। నేతెరంగుననిర్వహింతువునీవు। క్షీమకాటవులకునేలవచ్చెదవు, కోమలి
నామేలుగోరుచునిపుడు। గలుగకపుట్టింటికడకేగుమనిన। నెలుగెత్తిబెట్టగా
మేడ్చిభూనాథ। యిటువంటిమాటలనిపుడాడదగునె। కటకటానేనెంతకడు
పాపమతినే। యరిమరినడవిమీరదలంచునుండ। నరనాథపురమునవాకుండ
దగునె। కలగిమీరదవులకాయలనములు। చెలగినేనన్నంబుచెయిముట్టదగునె।

పణఁగొలలనీవు పవళించియున్న। స్వర్ణగేహంబుల శయనింపదగునె। నగ
ములపయి నీవు నలసి వర్తింప। తగిన మేడలనుండ దగునయ్య నాకు। మృగముల
లోనీవు మెరసి వర్తింప। మగువలలో నాకు మరియుండదగునె। గిరిగృహంబుల నీ
వు గ్రీడింపుచుండ। విరులపాన్పున నాకు విహరింపదగునె। నిను బాసి నిమిషంబు ని
లువంగజాల। నను బాసిపొమ్మన్న న్యాయమా నీకు। నెరిగి యెరిగిన నీవు నిట్లు బ
ల్కఁదగునె। నరనాథ నిన్నరణ్యంబున కనిచి। తగిలి బిడ్డలఁ జేరఁ దగునయ్య నాకు। జ
గధీశ నీపరిచర్య చాలించి భయపాటవులనన్ను బాసిన వెనుక। ప్రియము మెప్పనా
కును బిడ్డలేమిటికి। తరమిడి మాతల్లిదండ్రులేమిటికి। సురుచిరంబైనట్టి శుభము
లేమిటికి। పరగంగ తేను వున ప్రాణమేమిటికి। నరనాథ యనుచు మూసల నేడ్చుచు
న్నైని। కన్నులనిండారగారెడు నీరు। మన్న నడుడించియా మహీపతి తనదు। కన్నుల గ
డుశామ్యకంబులు దొరుగ। నన్నిల వేణితో నప్పుడిట్లనియె। ఏ నాక్షి నిన్ను నే నె
డబాసినపుడె। ప్రాణముల్ మేనిలో పలనుండగలవె। యెలమి నీయడవిలోయి
డుములనీవు। పడజాలవనియిట్లు పలికితిగాని। రొలనాగ యిపుడు నీవేలయేడ్చె
దవు। కలగకు నిను రోయగలనటే నేను। యనియూరడించి తొయ్యలి దోడుకొ
నుచు, చనుచున్న మిక్కిలి సాధింపదలచి। యుప్పు కుకలివారలరిగెను త్రోవ। ద
ప్పించి ఘనపర్వతంబుల శిలల। గట్టుల గుట్టల ఘనమైన పొదల-ఘట్టంబులను ము
ళ్ళకంటకచయము। నంతంత గల్పించియుత్త్యాన్న మగుచు। సంతాప మొనరిం
పచాలి నరయొండ। నంతట గల్పించి యులసట గొలిపి। యంతకంతకు నీడలగుపడనీక
ముడుగుల కున్న నిర్మలసలిలంబు। లెడపక నన్నియు నింకిపో జేసి। యాకటి పెల్లు
ననలసి యేమైన। చేకొనితినవడి చేదుగావించి। తెరవులదప్పించి తెలివిదూలించి
పరువులనలయించి భయము పుట్టించి। నడుపులపొలయించిన యము దూలించి।
తడబాటుదప్పించి దప్పిపుట్టించి। యీరీతిగావింప నినకులాధిపుడు। భోరున నది
దాటిపోవనయ్యెడను। మగువకొమ్ముడి త్రోవమరయు కంపలను। తగిలియు తప
చేలదప్పించుకొనుచు। మురువు దూలిన వాడిముండ్ల చేదియ్య। వెరచి మొల్లనదీ
సివెలవెలబారి। పరతెంచి కంపలబయ్యె సకొంగు నరిమురిదగిలిన నదిదియ్య
లేక। తనువాడిగల రాళ్లదాటి పాదములు। కనుమల నెత్తురుగారనందంద। గన్ను
లముత్యాలకయి పడినీరు। చన్నుగట్టులమీద జలజలరాల। జారిన కొంగు కేల్సాగి ప
డకేల। సారెకుసారెకు చక్క జేయుచును గదలిపోవుచునం బెగ్గటిన తనదు। పెద
వులదడవుచు బెగడుచు నవని। నడుగిడు లేక హాయనుచు శోకింప। పుడమిరేడా

త్నలోఁ బొరపుకఁ బొక్కి। పరిపూర్ణ కళఁ సోము బసలించు మోము। చరణముల్
ధూళిధూసరములయి యున్న। నీపాతకంబున నేమి సేయుదును। పాపపుదయివ
మీగతి నిగావించె। కటకటా నేపాపజాత వర్తనుడ। నటుగాననీదుఃఖమంది
నీయింతి। మటుమాయకలి బట్టి మగువను నన్ను। నటుగతినీతి బాధింపుచున్న।
దనితలపోయుచు నాయింతిగ దీసి। యనువయింపు మలసహాస్తంబు చేత। మొల
మిమేయు నూతగా నిచ్చి దోడ్కొను చుల్లరిన మూడాను మెల్లన నేకాంతదూర-
మరుగుచునున్న హంసముల్ రెండు। హరిత గరుడ దనికలి మాయచే నెలమి। నవర
త్న ఖచితమానిక్యపక్షములు। పవడంపు చాయ వేబ గను నాసికలును। పసిమిమిం
చుల బోలి ప్రబలి పాపులును। యనుపూవరుచిదేటలు బలరుమాపములు। గలి
కి ముద్దుల మాటకట్టినయట్లు। కలిమాయచే సుప్పిగగనమునుండి। కపటంపు
పక్షులు కవకవమనుచు। విభుతేసమునుందర వెరవక వ్రాలె। వ్రాలినగనుగొని

## నలరాజు పైవుట్టంబు పక్షులెత్తుకొనిపోవుట.

వసుమతీనాథు। డాలోలనేత్రతో ననిమొనిట్లనుచు। నలివేణి యనికిప్పుడా కలిచే
త। బలహీనమగుమనపరమేశ్వరుండు। మనమీఁద దయగల్గమరిపిరిబని చె। పని
బూని యీరెండుపక్షుల బట్టి। యోసురక్తి భక్షింత మతివయుద్ధరము। యనిప
ల్కి పక్షుల నపుడు బోసిక। కదియబోయిన జూచి కపటంపు పక్షు। లదరినగతి వేగ
నవ్వలి కేగయు। మెల్ల నేచని చని మేదినీనాధు। డల్లనల్లనయవ్వ డటు హొంచిపొం
చి। పట్టి చేతులు రెండు పార సాచుటయు। నట్టె చివ్వన లేచియావలనిలువ। మ
రిమరి వాటిని వెంబడి తరిమి। తరిమి దగ్గర బోయి దక్కినట్లుండి। యవ్వలి కరిగిన నా
రాజవిభుడు। క్రొవ్విడ చెదగాక గొబ్బున వీని। నేనేర్పు చేనైన నటు వెంటవగిలి।
పోసక పట్టెగ పాదవిరొని ప్ప। దనియిట్లు మదినిశ్చయంబానరించి। నలిబోశీనం
దుంచిన లమహీవిభుడు। పట్టబోయిన మిట్టి పడి వెన్కనిలుచు। బట్టకుండిన నేల
పాతరలాడు। తగినగతినుండు తగలకపోవు। దిగులొందినట్లుండు దిక్కులజూచు
వేసారి మరలిన వెస నొద్ద వ్రాలు। గాసిల్లు పట్టదగ్గరి సమతోలగు। దవ్వుల కేగును
దగ్గరవచ్చు। నివ్విధంబు పక్షు నెంతయు నలుని। నలయించి యలయించి నధిక
దూరము। చలమునగొనిపో వజనలోకనాథ। దలసి చింతించియునట పోక నిలి
చె। వలనొప్పపులుగులు వచ్చి భూవిభుని। దగ్గర వ్రాలిన తన మొలవల్లె। డిగ్గన పై
జడదిగిచి వయిచినను। పంచదా మెత్తుకపక్షులు దివికి। నంచలంబుగనేగి యుండు
డిపలికె। ధరనీవు నాడు జూదంబాడు వేళ। గరిమ పుష్కరు పాచికలలోననుండి।

నీరాజ్యమంతయునెరి ా చుకున్న। వారము మేముగువ్వలముగామయ్యె। యె
లమిరాజేంద్ర మేమెవరమోయనుచు। తలచకుమదిలోనతమ్ముఁడీమమ్ము।పం
చగ్గైకొని వేళ పారిరమ్మనుచు। బంచినకలిమాట బాటించియుటకు। పరువునవ
రుదెంచిపరికించినిన్ను।నిరువురనిట్టట్టుమెరిగిదూలించి। నిలుచుచునమ్మించినీ
మొలనున్న।వలువగ్గైకొంటెమిభళిభళినిన్ను। మెచ్చవచ్చును మేము మెల్లనే
పోయి।వచ్చెదమికనంచుబలికి మాయాత్మ। నెనసియున్నినకోపమింతటఁబోదు।
వనవినినికపసు బాటునుజూడు। మనియుగ్గడింపుచునునాకలిదూత। లనుగ క్తి
తోమాయమైపోయెనంత।నాపక్షులరిగిననాశ్చర్యమంది। భూపాలతిలకుండ
పాగిలిచిత్తమున। ఘనమైనశోకసాగరమునసుండి। తనదేసిగనిగ్గుతడబడిబ
లికె।పక్షులుపలికినపలుకులువింటె। సాక్షిగాతామరసాక్షినీవిపుడు। కల్లజూ
దంబాఎకటకటానేటి। కెల్లెడనింతయునతెలుగవేనైతి।నింతటబోవదెఎలనాగ
మనకు।యెం తేసియిడుములకిరువుగాగలమె।కటకటానీమీదకరుణయులేక
నిటుచేయగాకలికేమిచేసితిమొ।తొలగునె నేకన్నదుస్స్వప్నఫలము। పలుమ
రునుభవింపకగానివిడదు। కట్టడిదైవంబుకలరాజ్యమెల్ల। నట్టెగయికొనియ
రణ్యమునందుదోచె।తుదనుగట్టినబట్టదోచుకపోయె। నిదియేమిమాయమో
యెఱుగంగరాదు। యేమిసేయుదునింక నేమందువిధిని। యీమహాటవిలోనని
ద్దరమింక।నలివేణియేదుఃఖమనుభవించెదమొ। తెలియంగజాలమే తెరగింక
మనకు। ననియునిపలుమారునడలుచుబలుక।తనప్రాణవిభునితోదమయంతిబ
లికె। ఏలయీతలపోయుయినకులాధీశ। పోలించిచూడుమాబుద్ధికార్యంబు-
కాలకర్మంబులుగడసినచోట।ఫాలలోచనుడయినబాపుకోగలడె।జలమేధిర
కుమీరిచనుదెంచెనేని। కలదెయుపాయంబుకట్టించినిలువ। వసుధయీతరు
మించివచ్చునేలోతు - విసమెక్కు-నేతలవెంట్రుకల్గడచి। మిన్నువేగమెవ
చ్చుమీదిద్రావాలినను। మన్ననచెయ్యానిమురినిల్పతగునే-ఇంతేసికార్యంబులే
గుదెంచినను-వంతనొందుచుధృతివదలంగవలదు। తటుకునదైవంబుదయచే
తమనల-నిటుజేసితేనింక నేమనవచ్చు-యింతకుమిక్కిలినేమివచ్చినను-యం
తయుదుస్స్వప్నమనియాత్మనెరుగు-తలచకురాజ్యంబుతలచకుసుఖము।తల
వకుబిడ్డలతలచకుపురము।వదలకుధైర్యంబువదలకుబుద్ధి।వదలకుహరిచి తవ
దలకునీతి-పుట్టుభోగములన్నిపోయినవెనుకబట్టకువెరతురేభానుకులేశ।యు
నుచునూరార్చినెయ్యంబుననపుడు।తనకొంగుపగమునాతనిమీదగప్పె।నుడు

గకమిద్దర మొక చీరగట్టి యడలుచు నడవిలో నధిక దూరంబు నడచిపోవగ జూ
చి నగి వారు మరియు నడలి కకలి ధరామరరూపు దాల్చి కడు వేడ్కనచట మా
ర్గణంబులు నాల్గు తడయక కల్పించి తానొక్క త్రోవ తెరవరి విధమున ద్రిమ్మ
రుచుండె ధరణీతలేశుండు దమయంతియటకును చను దేర కపట వేషధరుండు పలి
కె నో నరరంగ యిద్దరు నొక చీరగట్టి ఎందుబోయెదరు డిందారి కానలలోన నెందుం
డి వచ్చితి రిట్టి దుఃఖంబు లెందుకు వచ్చె మీ వృత్తాంత మెల్ల కొందలమందంబు
నకక నిచ్చి మెరుగంగ చెప్పుమీ రెవ్వరటన్న ధరణీసుడప్పుడాతనికిట్టులని
యె వినుము విప్రవరేణ్య విశ్వంబులోన గొనియాడదగు భానుకులజుడా వీర
సేనసుతుండ నిక్షితితలేశ్వరుడ మానితసకలసామ్రాజ్యసంపదల గపటబూద
మున పుష్కరునకు నోడి విపినంబులో పల విహరించుచుండి చపలాక్షితో గూ
డ సరసత రాగ కపట మార్గంబున ఖగములు రెండు వచ్చి పట్టుట కేను వైచిన వల్లె
నిచ్చగా మింటికి నెత్తుక పోవ పొలతి గట్టినయట్టి పుట్టంబు కొంగు యొలమి పైగ
ట్టుక నిటు వచ్చువాడ నన గాత్మ వనలుండను పేరు వాడ నన వు టుక పటబ్రాహ్మ
ణుడిట్టులనియె నింతి నిసీ వింటలిడి కొనినీవు వంతగుందుచు ఘోరవనములో
పలను ఈరీతి తిరుగాడ నిది కార్యమగునే ఈ భామ నీ వెంట విడుములబొంద చా
లను మాకిది సంతాపమయ్యె నీలోన లోచననిక జూచె నేని ఘోర మృగంబు
లు పలవదు పాపంబు వచ్చు భూనాథ పదపడి కలిరాజు బన్నినమాయ ఇది మా
కు బూడగనింత టదోలగ ఎంతేసి కష్టంబు లింక రాగలవో ఇంతి నిక పుట్టినింటికి
ననుపు ఇట కేల తెచ్చితివిది బుద్ధియగునె కటకటా యిక నైన కాంత నంపింపు ఇ
న కులంబున జనియించిన నృపులు ఘనులందరి వుకు నిఘ మొంద ప్రాయె నొక
బుద్ధి జెప్పెద నుర్వీతలేశ యికనయిన వినుము నీ వింతుండ గూడ డిదుగో నాలు
గు త్రోవలేర్పడియున్న వది విదర్భపురికి నరుగుచునుండు నదియ యౌ ధ్యాపు
రికరుగుచునుండు దదిసు బాహుని పురికరుగుచునుండు విదియు తువణాపు
రాధన్వి గోవ నిమార్గణములను మీయిద్దరిమతికి సమ్మతంబగు త్రోవ జను
డు వేవేగ భూమి మీ నాలుగు పురములలోన దామనుతి ద్యార్యదనరి నగర
మని చెప్పి నదృశ్యుడయిపోయెనతడు మను జేశుడంతట మగువ వీక్షించి తొయ్య
లి నాల్గు త్రోవలలోన మనము చయ్యాన నే త్రోవ చను వెంత మనిన కరివృకఘు
టూకరసింహ సర్ప శరభాది బహుసత్వ సంచారవరుల దిరుగంగ నేటికి దేవు డేమ
నకు తెరువు విదర్భకు తెలియంగ జెప్పె మను జేశుయట కేగి మన వారి యొద్ద న

నువమగతినుండమనిభక్తి మెంక్కి-రమ్మనిబిలిచినరమణీలలామ-కమ్మావవే
శ్వరుండనియొక్రమ్మరను। వనజాక్షిమునునిన్ను వరియించువాడు। ఘనులగుమం
త్రాంగకర్తలుదొరలుకరుబు తేరులుతురంగంబులుభటులు-బిరుదువాక్యం
బులుభేరులువన్నె-పల్లకీలనితసువాసినీవిప్ర- పల్లవాధరులుపార్శ్వమ్ములనె
దుట-నేతెరమీతండ్రియేలువిదర్భ- కేతెంచినాడబహిఃర్మ్ముఖుల్మెచ్చ- చ
పలాక్షికనినన్ను చలమునబట్టి-కపటజూదమునపుష్కరుడనునన్ను-యోడిం
చియుద్దరికొకచీరజేసి-నేడులజ్జదొలంగి నేనేవిధమున- భామనీతోవిదర్భకునె
ట్లువత్తు। మామనేగతికాంతుమదిసిగ్గులేక-భూమీశుసభలోసబుధులెల్లవినగ
నేమనినాథంగమెరిగింతుమచట- చెడిచుట్టములజెంతజేరనేజాల-కడపటసతి
హీనుగాజూతురబల-నీవచటికిబొమ్మునీబిడ్డలచట। నేవిధినున్నారొ ఎరుగంగ
జాల-నావెంటనదిరాకనడువంగలేవుపోవిదర్భకటన్న పోలతియిట్లనియె-భూ
మీశనినుబాసిపోపొమ్మటంచు-వేమరుపలుకుటవిహితమానీకు- జలములో
నున్న జలచరజంతు-నిలమీదద్రోచిన నెబ్భంగిబ్రతుకు-నరుదారతరువుతోన
ల్లినతీగె- దరువుబాసిననదితానిల్వగలదె- నినుబాసిపోజాలనీపాదమాన-న
నుబాసిపోవుటన్యాయమానీకు।ననునేడునాతోడబలుకకీమాట।ననినకామి
నిజూచియువనీశుడనియె- నలివేణిమనమిప్పుడఖిలదీనతను- యొలుకుచునిద్దర
మొకచీరగట్టి।పోడిమినీరీతిపోవంగనగునె। నేడురాజ్యముబోయెనిన్నిమిత్తము
న-పైచీరయునుబోయెమెపతులచేత, నీచీరకొంగునుయొగట్టినాడ-నావిదర్భా
పురినటనీవునేను-పోవంగనప్పుడుపురజనుల్జూచి- యిలయేడుదీవులనేలెడు
వాని-చెలువల్లవదిలిపైచీరెయుపోయె-సురలనునొల్లకయిక్ష్వాకుయీరాజు- వ
రీయించినఫలంబువనితకుకల్గె- ననితూలనాడెద రిదిగానయిటకు- చనసునేనీ
వయినజనుమన్న బెదరి- చెదరినమనమునచెలియయిట్లనియె-హృదయశనన్ను
నీకిట్లాడదగునె-యడవులలోనీవునడలుచునుండకడుపడిమావారికడ కెట్లబో
దు- నినుబాసిప్రాణంబునిమిషమాత్రంబు- తనువుననిల్వంగ దగునెప్రాణేశ
తొల్లి జేసినయట్టిదుష్కృతఫలము-నెల్లబొందగనదివలపోనిచ్చు- హరునకు
మొదలుగాహత్యసిద్ధించి-హరియంతవానికినడలంగవలసె-దినకరచంద్రులు
దిరుగంగవలసె- నెనరునొక్కడునుకాలూదంగలేక- వాయువువిద్యనునఖిల
సంపదలు-వ్రాయబుట్టిన వాడువనజండతడు।నుదుటవ్రాసినవ్రాతనులిమితే
చెడునె-మదిలోననీవింకమరుగంగనేల- ననివల్కెనిద్దరునప్రుడుసమ్మతిని- చ

నుచున్న సుందరసహానాథపాళి మాలూరకరకతమాలమధూక। తాలఖర్జూ
రహింతాలామ్లపనస- సరళకింశుకలుంగ జంబూకటాది- తరులమధ్యంబునత
గనొక్కకొలను- గనుగొనిసోపానగతినుగ్గిరుద-దలియుంగడాఁవిగతశ్రముని
లగుచు, కొలను వెల్వడ దిక్కులును జూచి విజన, నిరత మొక్కటిగాన్పి నెరిదాని
డాయు, నరిగికూర్చుండెరియాటకలిమాయ, నెలయుంగనొక మాయనిద్దురగప్ప
వరపునవాడినవల్లి చందమున, పరుసతీతిన్నె పైబడినిద్రబోయె. తనకునిద్దర రా
కదరిదాపు లేక, వనితయు దానొక్క వస్త్రంబు గట్టు, కతమున నెడబాయగా
గూడకవుడు, మతిగణింపుచు కలిమాయ చేతనకు, గలరాజ్యమెల్ల పుష్కర
రాజుకోడి, కలుగుచు శపదంబుగడువంగ లేక, తన దేవియును దాన తనపురి వె
డలి. చనుదెంచి మూడువాసరముల చొప్పట, నాకడ నలసి ఘోరాటవులందు.
పైకొంకకపటంపుపక్షులకిచ్చి- కదిలియనేక బాధలకుఁదిరుండి- వగచుచున
చటికివచ్చి చేరుటయు, నలమట దుఃఖంబులన్ని యుదలచి, చటులమధ్యాహ్న
భాస్కరకిరణముల- స్ఫుటమరికందినబూదిగెబోలె-నడవులదిమ్మరియాకట
పొలసి-మదిరాక్షి తన దేవి మహిమీద బండి. నిదురబోవగజూచి నృపకుంజరుం
డు, సన్నుత సకలరాజన్యకామినులు- కన్నుసంజ్ఞలనూడిగంబులు సేయ, హం
సతూలికశయ్యలనానిద్రబోవు. హంసయానకుపాపమయ్యెబోనేల, ననుగూ
డివచ్చి కానలబొందినట్టి, తనదుఃఖమంతయు తగ జెప్పుకొనదు, దీని ఘోరారము
చూడతీరదు నాకు. పూసియచ్చటడించిపోయెదనింక- పసితల్లిగానక వనవా
సముడిగి. తనపుట్టినింటికి తగబోయి జేరు, నిటువలదీని కేయంత జెప్పినదు, ది
టవరికలిగి వాదిన్చునోననుచు, ననిపల్కకలదైవమవుడు ప్రేరేప- తన ప్రాణ
నాయకితగగట్టినట్టి, చీరసగంబుగా చేతులబట్టి, మరిగి మేల్కొనకుండ సడిమి
కినలుడు. తునిఇంచి మనమున దుఃఖంబు జెంది, వినతుండమెల్ల నేవిలపించితో

నలుడు దమయంతిని నడవిలో విడిచిపోవుట.

లగ, పోయెదనని లేచిపోయి రాజేంద్రుడు, నాయెడ మరినాలుగడుగులుపోయి
పోలేక మదిలోన పెగచిమూర్ఛిల్లి, యా లేమదగ్గరనరుదెంచి మగుడ, తనదు
పాదంబులు తప్పక జూచి, తనలోననిట్లని తలచి శోకించె, కటకటా నేపాపకర్ముం
డననుచు. నెటునెరుంగక నయోల్ తరలాక్షి. కోరివచ్చిన దేవకుజనుల నెల్ల,
వారించి నన్నే లవరియించె నొక్క, పడతినోచిన నోము ఫలమిట్టులుండె, నిడు
ములబొందెడి నీయరణ్యమున, కట్టడి నిధియాజ్ఞ గడపవశమె, ఇట్టి కారడవిలో

ఎలనాగనిన్ను, వాంటిగా విడిచి నేవోగిబోవజాల, వెంటదోడ్కొనుచు
నువిహరిన్ప లేను, కానినీకువాకతమున జేసె ఈమహాటడవిలోననిట్లుండగ
లిగె. నేనయాంగనీభాగ్యమిట్లుండెననుచు, తనమదినొక్కింతధైర్యంబుదెచ్చి
వనితపై మెదకొంగువలవొప్పగప్పి. యనుమానమేకటినరిగెదననుచు. నడలు
చుమతినాలుగడుగులుబోయి. తడబడిబోలేకధరణిపైవాలి♦ దిగ్గునలేచియా
దేవినిచూచి, దగ్గరకేతెంచితనలోనెతాను బెగ్గలంబందుచుభీతనిట్లనియె. ప
డతినీవడవులబడజాలననుచు, తడయకనీతల్లితండ్రులకడకు♦పొమ్మనిజెప్పినబో
జాలవెట్లు♦ నమ్మినావెంటనేనరయంగవత్తు♦నటువంటిదానినినకటా నేడు♦
నిటువంటియడవిలోనేనెటుబోదు♦ ననియమ్మహీపతిహాయనివగచి♦ తనమది
నిట్లనితర్కించి నేను♦ బోయిరావెనుకనీప్రాణబోణితేచి♦ పాయకనెబ్బంగిపల
విన్చునాకొరకు♦ పలవించియడవిలోపలనన్నువెదకి♦ బలువైనమృగములపాం
ల్పడునాకొరకు♦ పతిచేతనొల్లమిపడతివనేనుచు♦ నతిదప్పిప్రాణముల్మరిపీడు
నొకొరకు♦ యనియనిపలుమారునుదండదలచి♦తన బాయజాలనితెఱపునెఱుం
చి♦ మానినీగుణములుమానుగాబొగడి♦ మానినీమణిమోముమరిమరిజూచి
చనుగవణికించినన్నుంప్రనడుమువిరుతించికన్నులవెడలుపువెంచుతేరియరుచు
లనొందనపలుకులెంచు♦ తానిచ్చుచనువులదప్పకనెంచు♦ మునుపటిరతిసుఖం
బులదలంచుచును♦ తనలోనదానుసంతాపంబునందు♦ మరియును తెగువతో
మానినివిడిపించి♦ సరగునజనుదేరపతిమీదమోహ♦ మనుతీగెకాళ్ళకునప్ప
డుచుట్టి♦ పెనుగొనబోలేకపృధిపైనవాలి♦ పుడమిరేడట్టుమూర్ఛబోయిచాయి
కింత♦ తడవులదెలివియాతరలాక్షిచూచి♦ తిరిగియచ్చటికినేతెంచిదుఃఖము
న♦నరులకాంతులజేపురగులోచనములు♦ జలములుదొరుగనా జననాధుడని
యె♦ నెలతాగనినుబాసినేనెట్లుబోదు♦వనజాక్షినినుగూడినతఱంపుఘోరవన
ములుశృంగారవనములైయుండు♦నోలేమనీవున్నచోగిపూరిశయ్య♦లీలతో అం
సతూలికపానుపయ్యె♦వోరామనీవున్నచుగుదుర్గములునుమీరినబంగారుమేడ
లైయుండు♦బాలికనకుకూతీవశియించుపర్ణ♦శాలలుమరిచిత్రశాలలైయుం
డె మెలతనీసన్నిధిమృగగర్జనములు♦వలనొప్పసంగీతవాద్యమైయుండె♦మదిరా
క్షినీవున్నచోనిమ్ముఫలము♦మదికిదివ్యాన్నసంమదముఘటించు♦నీవంటికులసతినీ
యట్టిసాధ్వి♦ నీవంటిప్రియురాలునీయట్టిముగ్ధ♦ నీవంటికులశీలనీయట్టియబల
నీవంటిలావణ్యనిధి యెందుగలదు♦ తానైదైవంబుదయయించుంతలేక♦ తమలనా

గ నేనింక నేమి సేయుదును◆ ననియని పలవించియా మహీశ్వరుఁడు◆ తనమదినొ
క్కింత ధైర్యంబు దెచ్చి◆ యింత గాచింతింప నేటికిననుచుఁ◆ గాంతారభూముల
గలిగి యొకటి◆ కరిసింహశార్దూలగండభేరుండ◆ శరభపన్నగశరచమరీలులా
యా◆ కాదిపక్షిమృగంబులచేత◆ నేకీడు బొందక యీయింద్రువదన◆ తనతల్లిదం
డ్రులదగ్గరఁజేరు◆ నమరంగ హరికృపననుచు దీవించి◆ పోయెదనని లేచిపోలేక
మగుడి◆ పోయిమిక్కిలి వగఁబొందియూర్పులు◆ హాయని యేలుఁగెత్తినందందయే
డ్చుపోయెదనని బోయిపొక్కుచు దిరిగి◆ సయ్యనదమయంతిసరసకుఁ జేరియేడ్వ
డు నలుఁడు మహాతిజానిట్లనియెం◆ నిను చుపడిబోయిన నీయిందువదన◆ యెటునిటు
బడిబోయియున్న యుగ్రపథ◆ యడవిలో శూన్యగృహంబున దన్ను◆ విడచిపో
యెనుగూరుకుఁ వేళనిజేశు◆ డని తెల్పుతనవారలదివినినన్ను◆ మనమున నెటువం
టిమాటలాడుదురో◆ యదిగాక పురజనులందరు నన్ను◆ పగపడి నలుఁడిట్టిపాత
కంబునకు◆ సడలక నొడిగట్టెననుచు దిట్టుదురో◆ పడతి యిట్టిశుభవేళ పాపులైన
జూడ◆ జాలక విడిచెదసత్యమీమాట◆ పాలించి వినవమ్మ భూదేవి నీవు◆ నాకా
శవాణి నరియంగ వినుము◆ యేకతంబున మీరలిద్దరు సాక్షి◆ యెలత కేగతి నైన
మీరలేలక్షు◆ తలిదండ్రిదగ్గిరతగ జేర్పవలయు◆ నవి యొప్పగించి చయ్యన బోదు
ననుచు◆ చనివని మరిపోవ జాలక తిరిగి◆ వచ్చియాదమయంతివదనంబు చూచి◆
యుచ్చెటమలుగత్తిహాయనియేడ్చి◆ పోలేకపోలేక పొగులుచునుండ◆ నాలో
నకలిదేవుడతివపైఁగలుగు◆ మోహపాశంబుల మొదలంటఁబెట్టి◆ సాహసంబున
ద్రుంపచయ్యననలుఁడు◆ మనమున నివియేమిమమతలటంచు◆ జనినిశ్చయించి
యుచ్చటనిల్వలేక◆ నదులు శైలంబులు నగములడచి◆ పోదలుచు వేవేగపో
యె ఘోరవిఘ్నము◆ పోవంగ తనబుద్ధినింత చింతించి◆ వారిరిపోసిలోవక్యంబు గేరుతు
ననియెగ్గు దేవునినచింతించిపిలిచి◆ కనిమారురూపుని గాఁజేయుమితని◆ నలుని
నీకు సహాయంబు గాగ◆ పలుప్రదుచనుమన్న పసిబూని పేర్చి◆ యురువడి విసరు
మహోగ్రవాయువులు◆ తరుకాఖలన్ని యుతరుచు గాబోర సెనాకాశ జేనిప్పు
లందంపబోడము◆ యేక స్త్రీనా కాననే చ్చుచువచ్చె◆ తగిలి పెన్మంటధగధగనుం
డు◆ భుగభుగ పొగలుగుంపులుమింటికెగయ◆ తరుముగా మండుమతిపూవుల కే
గసి◆ దరికోని పాదరిండ్లు పెళమగా మండ◆ మాకులు పెళపెళమహిమీద వ్రా
లు◆ వీకమృగంబుల వెలవెలబార◆ ఖగములు తెక్కలుగాలిసక మలి◆ యుక్కజంబు
బోవగలేక నిలవ్రాలిపోరలు◆ నకొడకొడదాగినట్టి సర్పములు◆ యుక్కజంబు

శ్రీరస్తు.

# నలచరిత్రము - ద్విపదకావ్యము.

## చతుర్థభాగము.



అటమున్ను నలరాజు ననుఁగుబిడ్డలను♦ తటుకున దమయంతి తండ్రు
లింట♦ విడిచి వార్ష్ణేయుండు విపినభూములకు♦ వెడల నలక్షితివిభుఁ డంతఁ గూడి♦
యనుమాట విని మున్నె యా ఋతుపర్ణు♦ నొనరంగ మరి కొల్చి యుండె దా నలు
డా యరసి వార్ష్ణేయుని యుండం దగఁ జూచి♦ సరసత దన సారథిగాఁగ నెరిఁ యాత
నితోడ నేమాట దెలుప♦ కేగ గనిగతి నుండె నేమియు ననక♦ నక్కడ దమయంతి
దారిది మేలాకలించి♦ సొక్కుచు తనపతి పోడ గానక లికి♦ నలుదిక్కులను జూచి
నలినాక్షి గుండె♦ చలియించి జించిన చీరయుఁ గాంచి♦ దిగ్గున లేచి పృథ్వి గ్రక్కై వడని
యగ్గలంబుగ మూర్ఛ నవని స్రైవ్రాలి♦ మానిని యామూర్ఛ నొక్కింత దెలిసి♦
మేనెల్ల మలియించి మేనెల్ల నేలేచి♦ నేలఁ ఖ చుని గుడిన వగల♦ వాలుఁ గన్నుల
నీరు వరదలై పార♦ పలు దెరంగులఁ దన ప్రాణేశు దలచి♦ వెలవెలఁ బాటున విలపిం
పదొడగె♦ హా రాజదేవేంద్ర హా దయాసాంద్ర♦ హా రాజమందార హా జయాకా
ర♦ శ్రీఘనబారాశికరిత్రసమవర్తి♦ నాకేశనుతకీర్తి నలచక్రవర్తి♦ యొక్కటా
యిట్టి ఘోరాటవిలోన♦ తక్క కననుడించి తలగిపోదగునె♦ ననుబాసిపోనని
నాతోడఁ జెప్పి♦ పెను నిద్రపోయిన ప్రియ నన్నుడించి♦ కటకటా నామీద కరుణ
జాలించి♦ యిటు డించిపోఁ నీకేమి జేసితిని♦ నిను బాయగా లేను నిమిషమాత్రంబు
నను బాసిపోవుట న్యాయమా నీకు♦ యొక్కటే ప్రాణంబులొనర నిద్దరికి♦ మ
రు వలోకక్క టేమన నిద్దరికి♦ నోడకు మని చున్నార డబలికె♦ పాడి మేయ
డవిలో పలడించిపోవ♦ నిట్టి కారడవిలో నటనన్నుడించి♦ వెట్టులు పోవ న్యా
ట్యా జేసికు♦ గ్రైకోన కెడబాయ నేన్నడైన♦ నీకు నే జేసిన నేరంబు లేమి♦ కట్టడ దై
వము కానలో నన్ను♦ యిట్టులొంటిగ నుండగ దలఁ జేసెనా కో♦ యెన్నడు రాదు
గా నిటువంటి నిదుర♦ నిన్ను నను బాప నేడు వచ్చినది♦ తనువున ప్రాణము ల్
దలచుచున్నంత♦ నినుఁ జాసి యోంతుఁ నేసిని పాథమైన♦ నిట్టి కారడవిన న్నె
కతడించి♦ ఎట్టు పోలేనని ఎంచితివి దిని♦ ననుబాయ ననుచును నా ప్రాణవిభుఁడ♦ వ
నిని నిన్ను నమ్మి యిదకు నీశబంద్ర♦ ఇచ్చట నను డించి ఏల బోయితివి♦ వచ్చి నా కచోట

ములాధ్వనివినికలగుచునుండె ♦ నప్పుడు దమయంతి యచ్చోటఁ బాసి ♦ మఱపురి
యగుశోకమున ప్రాణవిభుని ♦ నడవిలోపలబాలహరిణియుం బోలె ♦ వెదవెదనం
దంద వెదకంగదొడఁగె ♦ తరులార నాసహోదరులార మీరు ♦ ధరణీశ్వరుని జూడ
తగఁజూపరయ్య ♦ సురలార మీరైన సురరాజవిభుడు ♦ తరలిపోయినజాడ తగఁజె
ప్పరయ్య ♦ భూదేవి నీవైన భూలోకనాథు ♦ డేదేశమునఁబోయెనో యెఱుగింపవమ్మ
నను గావరయ్య కిన్నరులార పుణ్య ♦ ధనులార గనులార తాపసులార ♦ కరులార
హరులార గవయంబులార ♦ శరభసాళ్వములార సర్పంబులార ♦ మనుజేశుఁడ
రిగినమార్గంబు నాకు ♦ నెనసినకరుణతో నెఱుగింపరయ్య - యని యాని యాడు
గొచు నటునటు పోయి ♦ ఘనమైనబొద లెల్లఁ గదిలించి చూచి ♦ వీరువారనక నవ్విధ
మున దిరుగ ♦ నోరెండ దప్పి తిదూలె నొక్కప్రాణములు ♦ మోడివిడె క్రొమ్ముడి మూ
పుమైజార ♦ నడుగులఁ గొంటిలనందందఁబడలి ♦ పగడఁపువాతెఱ పదునింకె వాడ ♦
జిగిదక్కి పాపటచీఁకాకుపడఁగ ♦ కన్నుల జలజలఁగారెడు నీరు ♦ చన్నుమిట్టలమీఁద
జలజలఁదొరఁగ ♦ నన్నన్న యని మసియాడఁబడంగ ♦ తన్నుఁదూరుచును గద్గదకంఠ
యగుచు ♦ హా [illegible] విభ నాథ ♦ మాయజూదంబింత పుట్టుకకుఁ దె
చ్చె ♦ మాయప్రేమలు జూపెనా యయ్యో నాథ ♦ పోయి యే చోటికిఁ బోయితేయ
నుచు ♦ నెవరనుచు నిఘ్నఁ గినెఁ బ్రచురపుణ్యసి ♦ పిఱుపక వెదకుచు విపినంబులోన ♦ కం
దుమ దమయంతి యొక్కసారంబు ♦ సందుగొందులఁ బడుచున్నయపుడ ♦ ప

## దమయంతిని సర్పంబు మ్రింగుట.

దపడియానసమీపంబున నొకట ♦ పొదరింటిలోననున్నపుట్టలో నుండి ♦ తనతలయె
త్తియాతన్వి నీక్షించి ♦ పెనుబాము జెలగుచు బిరబిరవచ్చి ♦ రోజుచు కన్నులరో
షాగ్నులదర ♦ రాజిల్లువిషములు రాజిమంచుచును ♦ కలిదేవుపనుపున కామినీగ
దియు ♦ విలవిల ప్రాణముల్ విడిచి గిలంగి ♦ హానాథ యని మూర్ఛనవని పై నొరిగె ♦
బూని యప్పుడు ప్రాణభూమీశు దేనుప ♦ వనములఁ బట్టితిప్పక మ్రింగుచుండె ♦
మది రాజ్ఞి యప్పుడు మరి మూర్ఛదెలిసి ♦ భర్తను మ్రింగుచునా ఘోరదందశూకం
బు ♦ గనుగొని శోకాగ్ని గ్రాగుచు బలికె ♦ నకట టాయి యాఘన ఘోరమైన ♦ సికదా
డవాకింత నెవ్వారు దిక్కు ♦ నామును విడిపించు బలవంతు లెవరు ♦ నామేను మ్రింగుచు
న్నది యంతకంత ♦ కల రాజ్యమెల్ల పుష్కరునకర్పించి ♦ కలిరాజమాయచే కాన
లఁజొచ్చి ♦ యిడుమలఁబడి జీవితేశుని బాసి ♦ కడపట వచ్చి యీకాలసర్పంబు చేత ♦ బ
డుటకనాప్రాప్తఫలమిట్టిదిగ బుండె ♦ నడరంగ నిపుడు నా యాపదమాన్ప ♦ వదేసట

మంచివాఁడుండమేను♦ నీకేలజీ తింపనీకోర్కెలెల్ల♦ జేకొనికొనసాగసేయ
దునన్న♦ నమ్మినా యింటికినలివాత్మీరమ్మ♦ నమ్మితినాయింటసకలసంపదలు♦ గ
లవన్నిటికినీవు కర్తవైయుండు♦ పలుదెరంగులనన్నబంటుగానేలు♦ కొని
యుండుమనీకేమికొదువలులేవు- యొనరంగ నావెంటయూరకరమ్మ♦ పట్టణంబు
లుబోలుపరగ నాపల్లె♦ నెట్టనగనుగొనినీవె మెచ్చెదవు♦ మానినినేను సామా
న్యుండగాను♦ తేనియల్ వడయంగ తెరవాళ్లుగొట్టి♦ కడిగికన్నము బెట్టి గడి
యలువియ్య♦ పుడమిద్రవ్యములెత్తమూలలడాగ♦ ముదుపులు కట్టించ మో
గసాదుకజల్ల♦ నడుగుదాచుకపోయియావలనుప♦ వలలొడ్డుదురులొడ్డవా
గులుగట్టి♦ పులులరాకట్టిభోరనదొట్టి♦ గురుమృగంబులబోడ గూడంగబారి
సరవములబడనేచుశబరినమగత్త. నాయంతవాలవరిపలినాయుతాత్మ, బోయ
రాజులలోనబోడగానమెందు♦ నే వేళజూచినయట్టిమాంసంబు♦ గావలెనన్నను
కలదులేదనక♦ కావున నా వెంటకదలిరమ్మనిన♦ పినచాలకోపించి వెలవెలబా
రి, తనకోపమంతయు తనలోననడచి♦ యా పాపకర్మునినందందజూచి♦ యాపు
ణ్యసాధ్వి నెయ్యము మీగబలికె♦ నోయన్నయిదినీకునుచితంబుగాదు♦ సాయ
కవినరానిపలుకుపలుకెదవు♦ ధరణీశుసతియును తనను తల్లియును♦ సరియం
డ్రు పెద్దలు జగతిలోనేల♦ నను మాటవినవుగాయన్ననీకెదియు, వినుపింతునిది
బుద్ధివెలయంగవినుము♦ దనరినవే గురుతల్లులలోన తనగురుసతియొక్కతల్లి
యైయుండు♦ తనరాజుసతియొక్కతల్లిగానుండు, తనయన్నసతియొక్కతల్లి
గానుండు♦ తనసతితల్లియే తల్లిగానుండు♦ తనుగనినన్నిచ్చుతల్లియుగాక♦ తనత
ల్లిసములైన తల్లులువీరు♦ యిలలోనవీరియందెవ్వరినైన♦ నొలవక కామించి
చూచినంతటనే♦ యాయువుజెడిపోవును కీర్తిజెందు♦ మాయును ముఖలక్ష్మి
మానంబుమాసి♦ పాపంబువర్ధిల్లి ఫలమెల్లచెడుగు♦ రూపంబుచెడిపోవు రోగం
బువచ్చు♦ నెపుడురాదెన్నడు నెడయు పుణ్యంబు. తాపంబుబొడము సంతాపం
బువచ్చు♦ నాపదలనుజెందును సజ్జనంబాదవు♦ చూపులువాలియును సుఖమెల్ల
దొలగు♦ తేనువదప్పను దీనతవచ్చు♦ దాకొను ధైర్యంబుతొలగులు మరియు♦
నంతటబోవక యమకింకరాళి- నంతముద్గరశూలఘోరగదాది♦ సాధనంబుల
మరిశస్త్రాస్త్రములను♦ బాధింతురిదిగాక బహుపురీషామూత్రగంధంబున
బొరలింతురుగ వైతరణీనది వడినెటిత్రోతురు దుర్గకపెకేకల్ ద్రులలుంతురుమ
రియు. బడిబడి నరకకూపములపాతకుల♦ విని వేదశాస్త్రంబులనిశంబు దెలుపు

మనముననిట్టిమర్మంబులవిడువు♦ మటుగాననీతల్లినగుదునిచ్చుటకే♦ పటుగతివ
చ్చియీపామునుజంపి♦ నన్నురక్షించితినాతండ్రివైతి♦నన్ననీకిటువంటియల్ప
వాక్యంబు♦ ననుబల్కఁ దగదన్ననాతిమాటలను♦ వినివాడిశూద్రులవీనులలో
నాగ్రుచ్చినగతినొచ్చికోపించి♦ బోయియుచ్చపలాక్షితోనప్పుడిట్లనియె♦తర
ళాక్షియిటువంటిధర్మశాస్త్రమును♦ చౌరవువిరునకునీసుద్దులువిడువుమును
నీవుయమలోకమునబాధలెల్ల♦ ననుభవించినయట్లనరసిచెప్పెదవు♦ పాపపు
ణ్యంబులుపరికింపమెప్పు♦ డేపారశాస్త్రంబులెరుగమువరియు కలకంఠి [illegible]
ముదుమాకడకురావెరచు♦గిలిగింతలనుబుట్టకేరలునేశిలలు♦మాకుపాపము
లేదుమదిరాక్షినిన్నుగయికొనిపొందంగగానినేపోవ♦ననవినియనప్పుడురౌద్రా
కారియగుచు♦ తనలోనమందుచుతరలాక్షివెరయ♦నాదువృత్తంబులుపిడేమి
యెరుగు♦కలుషాత్ముడనివానికనుగొనిపలికె-వోరిపాపాత్మయీయురగంబు
జంపి♦కారుణ్యముననన్నుగాచితిగాన♦ రయముననినుజంపఁ దనియున్న-భ
యమింతలేకదుర్భాషలాడెదవు♦ నీవేడనేనేడనీమాటలేడ♦ నీవిందునుండకని
పుమపొమ్మనిన♦నప్పుడునాడరౌద్రాకారియగుచు-నిప్పులుకన్నులసి డాంక్రో
రుగ-నప్పద్మలోచననల్లనజూచి-కప్పినకామాంధకారంబుచేత♦నేనేనుతె
లియకదగ్గరరాగ-వెనుకకుపోయియావెలదియిట్లనియె-నింతించువచ్చెద
వికజూడవోరి♦ పొందిననీగర్వమునడంతుననిన-బలవంతముననిన్నుబట్టిపైబ
డిన♦ జెలియేమిచేసెనుచెప్పుమాయిప్పు♦ డరసిబట్టగమకించునంతలోపలనే♦
యెనరంగనికనూరకుండరాదనుచు♦ తనలోనదలచియాతామరసాక్షి- మన
మువాకులనమరిసేతలందు♦ వరునిగొల్చినపతివ్రతనౌదునేని-నరలోకవిభు
డైననాగూమిఁవిభుని- వరునసత్యంబుదప్పకనుండునేని♦ హరికృపనొందిన
యంగననేని♦ బోయవాడిప్పుడేపాలసిమగఁటని♦ బాయకబడునని పడతి శపిం
చె♦ నడలనియాఘోరశాపాగ్నిదగిలి♦యుంగకనాబోయయుబ్బెల్లబోరసి♦
పిడుగులువడికొండపృథివిపైగూలు వడువునదెప్పునవసుధపైగూలి♦ గలుగు
చూపులుమాయగాళ్లుజేతులును♦ విలవిలదన్నుకవిడిచెప్రాణములు♦ నంతలో ద
మయంతియచ్చోటబాసి♦ వంతగుందుదుశోకవార్ధిఁనీదుచును ♦ భూపాలు
డిటుబాసిపోవుటజేసి♦ ఈపాతకుడునన్నుయిట్లాడుగాక♦నావిభుడెందున్నన
న్నుబాధింప♦భావింమనేవిడుపలుగానిగాన♦ మగదిక్కులేకున్నమగువప్రా
ణంబు♦తగవుబెట్టుకయుండధారుణిమీద యిట్టిపాతకునెందరిబ్బోటతెరువు

గట్టుకొనన్నెంత గాసి బెట్టుదురో◆ పతిడించిపోయినపడతినీబుద్ధి◆భటులుసంజే
పింటుమాటలునిజము◆ మాటికెనుగవాడు మహీమీదదిరుగ◆ నాడది వంటి
గానరుగంగబోల◆ దాదుపుట్టుకపుట్టున్నదోషంబు◆వాడివిభునిపగవారికివల
దు◆ నక్కటాయబలనీయడవిలోపలను◆ దిక్కుమాలినయట్లతిరుగంగవలసె
కొండలనడవులగ్రుమ్మరజాల◆నొండేలనికప్రాణమునుపంగదగదు నెనిమిటి
కెక్కగ్రపియుడు నెడబాసి◆జనుమని యవ్వసుశపియించురో కోకయః త్రీగనెలు
గునవాకో మలాంగి-తననాథుజేరోకని తానేమ్మక కొనుచు◆నరుచారనెడురు
గాననలుంము ప్రబలి◆ పసువడిపొదలెల్లబస్మీకరింప◆తరలాక్షిచని వేడ్క దావా
గ్నినదుము◆ నరుదారచొచ్చినదిచల్లనయ్యె◆ కరితొండములుతనకరములబ
ట్టి◆ కరికరిబెనగినకరులూరకుండె◆ వెలుగుపిల్లలబట్టియిట్టట్టు సేయ◆వలగొ
నియెలుగులవ్వలకుగొలంగె◆పులులున్నకడకుగొబ్బునబోయికడసి◆పోయియు
టకెదరినబోరిగొనవెగచె◆కంఠీరవంబులకడసియాకంబు◆కంఠజేరిననకిదియ
కపోమ్మె◆వడపిపండులజేరినందందరాళ్ళ-నడబుచురువ్వెననపిపారిపోవె◆పా
ముపుట్టలలోనబాహువుల్సాచి- పామిదికరువకఫణులుదొలంగె,తోణికెడు
కొలకులదుమికెనజలము◆ఫణివేణికూరులబంటైయుండె, నడిబావిహయని
యాందందయేడ్చి-యిదియేమిమాయమో యెరుగంగరాదు◆ పరువిడి సేమహా
పాపినిగాన◆ సరగుననిపుడేలచావుసిద్ధించు◆ ననియనివగచుచునాదమయంతి
చసిచనిమరియనుచరియలదుమికె- నీరీతిప్రాణంబులేమిటబోక◆నారామయ
డవిలోనలమటబడుచు◆ జనులేమితినుదురోచావునకనుచు- మునుకొనివిషప
త్రములగోసితిననిన◆ నావిషపత్రంబులాకలిదీర్ప- చావురాదనియేడ్చిచనుచు
కట్టెదుట◆పనసపిప్పలినింబపాటలివకుళ-ఘనసారసౌవర్ణఖర్జూరములను-
పొన్నలుపొగడలుపోకమ్రాకులును- గన్నేరునుమల్లికలుచూతతరులు◆ కదలి
కుందకదంబకాంచనకుటజ- బదరితింత్రిణిబిల్వనారిభద్రములు, తెలియంగక
మ్మపూదీగె◆ప్రబలి◆ బలునైనజలువచప్పరములసలరు- చల్లనినీడలజాతివై
రంబు◆ లెల్లనువిడిచిప్రియంబునబొదలి-సింగంబుకోదముచేరియేనుగులు◆ చెం
గలింపుచుముద్దుసేయుచునుండు, పేనుజాడదప్పినపెయ్యలవెదకి,కొనిపోయి
మొనవులగూచేడపులులు◆ లేడిపిల్లలనుపాలింపుచుగూడి, యాడుచునుం
డి పెంపలరు రేకులునుసరసంబుగామంగసలమీదనెక్క- పరువతోబాకెటివ
రపన్నగములు- యెలుకలపిల్లలనెలమితోగూడి◆కులుకుచుముద్దాడుకొనెడువి

ల్లుబున- పలుచననీళ్ళలోబడియున్నమీను♦ కలుకుచువాటితోగూడుచుకొ
క్కురబు-కోకిలాభర్తలనుగూడియుండంద♦ చేకొనితేతభక్షించు కాకంలు
ను_ఛాలుపొందనవివిధంబునవినోదంబు-గలిగియుండినయట్టి ఘనతపోవనము
దమయంతిగనుగొనితనలోనమెచ్చి-యామరిననయ్యత్రిబృగ్వాశ్రమభూమినేమా
నియుఁ సునొయిదియూతమనుచు♦ నాహితానిమిమణిసిజటికెతెంచి♦ పురుషప్ర
మాణంబుభూమిపైకెగసి♦ పరమాత్మనాత్మలోభావించువారి♦నొకట-పా
దాంగుష్ఠమూర్విపైనిలిపి_ సకట ధ్యానసిబూచిచొకట-నవారి♦ తరుశాఖలంను
పాదములుతగిల్చి♦ కరమధికతల్రకిందుగాద్రేలు వారి - పద్మాసనంబున
పరగగూర్చుండిపద్మాక్షునుతులుదప్పక సేయువారి♦ హోమమంత్రంబులు
నుచ్చరించుచును - హోమంబులలిభంగినొగివేల్చువారి - కరములుముకు
ళించికన్నులమూసి- చిరభక్తిజపములజేసెడివారి♦ కనుగొనిమదిలోనకడు
సంతసిల్లి ♦ చనిచనిమందసన్యాసీశ్వరులు ♦ కొందరుముందరగూర్చుండి
యచట బొంపుగా వేదార్థములవేడుకలరి♦ నొకట-రికొకట-రువొగిజెప్ప
చుండ, నకా-మినీమణియమ్మహాత్ములకు♦ తప్పకసాష్టాంగదండంబుబెట్టియు
ప్పుడుదమయంతిహాయనిఏడ్వ♦ కనుగొనిబాలయోగధ్యానమహిమ♦ మనమూ
ననదికలిమాయగానెరిగి♦ యొండొరులపండడినొనరవారించి♦ నిండినకృప
తోడ నేలతకిట్లనిరి♦ యొలనాగనీవిట్లేలయేడ్చెదవు♦ వలవడుకమర్తంబువచ్చి
నవేళ♦ యూడుకన్నులుగలమూర్తికైనను♦ వాడిమితప్పింపవశముగాదిలను
మదిరాత్రిచూచితే మాయోగదృష్టి ♦ నదిసెడుచెప్పెద నంతెయువినుము♦
కలిగాజు చేసినకపటజూదమున♦కలరినీవిభుడురాజ్యంబెల్లనోడి♦ కలకంఠనినిను
గూడికాననువచ్చి♦ పులుగులచేచేలమునుగొనిపోయి♦ చెచ్చెరనీపైటచెరగు
గట్టుకొని♦ వచ్చికోలంకనవడినిరుద్రా వి♦ యత్తిరవిజనగేహముప్రవేశించి
నెత్తినేలపవ్రాల్చినీవందునిద్దుర♦ బోవుచునుండగపురపురబొకట భావించి
నినుజూచిపాసిపోలేక। శోకించిశోకించిసుందరనీవు♦కోకకొంగొకయుంతగొ
బ్బునజించి♦ యొదిగట్టుకొనినిన్నువచ్చటుడించి♦ పదపడిపోవ భూపతినొకట-
పాము♦గరచినవాతనికాంతియుబాసి♦పరువడివికృతరూపముననయోధ్యక
రిగియూరుతుపర్ణునందంగాంచి♦ గుహాంతరభక్తితోకొల్చివసించె♦నలివేణినీవి
ప్పుడానిద్రదెలిసి ♦ వెలవెలపాటునవిభుకానలేక♦విపినంబులోపలవిహరింపు
చుండ♦ నవుడొకపాముచయ్యననిన్నుమ్రింగ♦నొకబోయవాముఖుడాయుర

వారలజూచి-తనవృత్తాంతమంతయుజెప్పబోడగ-వినరయ్యజెప్పెదవిశ్వం
బులోన-వినుతికెక్కిననలోర్వీపతిసతినిధరణిలో వాసిదమయంతియండ్రు
నరలోకసుతుడైననాపాపియాధు-డెసగంగజూదంబునెలమితోనాడి♦ వసు
మతి దాయాదివారలకోడి- యడవులజరియింత మనివచ్చిమేము ♦ పడరాని
యిడుములబడియొక్కచోట♦నిలిచియొకకూడ నేనునిదురబోవంగ- కలిమాయ
చేనన్నుగానలోడించి భూనాధుడెక్కడటోయెవోయెరుగ ♦ కాన రేనలమ
హీకాంతునిమిర - నిలనే దీవులనేతెపవాని ♦ నలరిష్ణప్రీతికై బ్రాహ్మ
ణులకు- భయభక్తిమీరంగబహుళసంపదల - ప్రియముడొప్పగానమర్పించిన
వాని♦నిత్యసత్క్రతువుల నెగడెడువాని - నత్యంత హరిభక్తి నమరినవాని♦
జగతినిక్ష్వాకు వంశజులకందరికి - పొగడొందు కీర్తుల బుట్టించువాని
నోతంద్రులార మీరుర్వి నెందైన ♦ బ్రీతి జూడరుగదా పృథివీ
తలేశు, నవపుడువిని వారలాన్నెగావగచి, పనిబడిమాతగ భావించుకొనుచు
తోయజహితదీప్తిదూరనియాట్టి- యీయరణ్యంబులనేల వేగింప - పురముల
లోగాని భూలోకనాథుఁడుమత్తగాటవిలోననుండంగబోడు♦సతినీవుమా వెం
టజనుదెమ్ము భామిని- సతియాసుబాహునిపట్టణంబునకు-పోవుచున్నార మో
పూబోడి యనుచు-వారిరివోడాగనివడివడినరుగ- జెదరకతాముచేసినపుణ్య
మహిమ- నెదుటనొక్కతటాకమింపొందియున్న నదిగనిజనుపవారందరా కో
లను- గదిసిగోనెలనొక్కకడబడద్రోచి- దనగనెద్దులనీరుద్రావించిమరియు♦
తనవినింపారనందరునీరుద్రావి వేడుకతోచెంత వెలసినద్రాక్ష♦నీడలనందరు
నిలిచిగూర్చుండి♦ తమతమబడలికల్ తామె చెప్పచును - దమయంతిచూచి
యోతల్లినీవిపుడు.కొదుగకసుదకంబుగ్రోలుమటన్న. మదిరాక్షిపోయియా
మంచిజలంబు. లాకకొన్నిగ్రోలియొగిమూర్ఛబోయివికలత్వమున లేచివిభు
నిదలంచి-యెటుబోయితివి నాథయిడుములనొంద- నిటునన్నుడించి నీవెంచుచున్న
వాడ- వనుచుమహాఘోరశోకమందుచునుండె జనపవారప్పుడా జలజాయతాక్షి
శోకంబుమాన్పనచ్చోనొక్కచల్ల- భూజనీడనుచేరిమగువగూర్చుండ♦ తన
వంశవభవుడుభూధవుడైననలుని♦ వనితకష్టముజూడవశముగాసక్త-గిరిజరె
నన్నుభంగినిచొప్పుగగన- సరణనిపశ్చిమాచలమునకరిగె♦ తడబడమింత సం
ధ్యారాగమొప్పె♦కమువడిచుక్కలుగనుపట్టెనింట-నదినభంబిడిభూమియుని
యొప్పుసాడ♦ గదిసియింతంతచీకటినిండబర్వె మెందుగాఘూకముల్ మెల

